# మణిమాల

(ఖండకావ్యసంపుటి)



కృతికర్త:

వానమామలై వరదాచార్యులు,

మణిగిరి.



కృతిభర్త:

శ్రీ శ్రీ గుండవరము జగన్నాథరావుగారు,

జమీందారు: గట్లనరసింగాపురము.

హుజూర్‌నగర్ తాలూకా, కరీంనగర్ జిల్లా.

1945

# పీఠిక

నేనొకసారి కొందఱు మిత్రుల యాహ్వానముమీఁద వరంగల్లు వెళ్ళితిని. గృహస్థధర్మము రూపుగొన్న కాళోజీవారికి నతిథిగా నుంటిని. ఆయూరి కవు లిద్దరు వచ్చి వారి రచనలను నాకు వినిపించిరి. ఒకరు ఆయూరిలో వకీలు, రాఘవరెడ్డిగారు. రెండవవారు ఈ గ్రంథకర్త. ప్రబంధశైలిలో రాఘవరెడ్డిగారి కవిత్వ మెంత రమ్యముగా నున్నదో ముద్దైన పలుకుబడిలో ఆచార్యుల వారి రచన యంత రమ్యముగా నున్నది. ఇంత చక్కనికవి పూజాపురస్కారములు లేక బూజుపట్టు చున్నాఁడని యచ్చటి మిత్రులకు శిఫారసు చేసితిని. మఱి కొలఁదిదినము లలో గుండవరపు జమీందారుగారు తన గ్రంథ మచ్చొత్తించుటకు నంగీకరించి రని తెలుపుచు నాచార్యులవారు వ్రాతప్రతియును, కొంత విత్తమును దెచ్చి నాకిచ్చి దీనిని ముద్రింపించు భారము నామీఁద నిడిరి. ఈ పని జరిగి యేడాది పైనైనది. ఈ సంవత్సరము పైచిలుకు దీనిని ముద్రింపించుటకు నేను పడ్డపాట్లు భగవంతుని కెఱుక. చివరకు నిది నా చేత కాని పనియైనది. కవియే యాయన త్రిప్ప లాయన పడినాడు. చివరకు నావంతు పీఠిక మిగిలినది.

ఈ గ్రంథమునందు దోషములు కలవు. వీని యన్నిటిని దాటి కొన్ని కొన్నిచోట్ల కవియొక్క ప్రతిభ యనంతమైనది కనిపించును. గోల్డుస్మిత్ (Gold smith) కవి వ్రాసినట్లు ఒక గ్రంథ ములో వంద తప్పు లుండవచ్చును; గ్రంథము రసవంతముగా నుండ వచ్చును. మఱియొక గ్రంథములో తప్పొక్కటియు లేకపోవచ్చును. గ్రంథము రసహీనముగా నుండవచ్చును. ఆధునికులలో ప్రసిద్ధులైన యెంతమంది కవుల గ్రంథములలో తప్పు లుండకూడదు? కాని వారి గ్రంథములు రసవంతములు కావని యెవ రనగలరు? పాఠకులలో రసజ్ఞులు వేఱు, వట్టి పండితులు వేఱు. వట్టి పండితు లింత గ్రంథములో నొక తప్పుచూచి చీదరించుకొని దానివలన తమ పాండిత్యప్రతిష్ఠ వృద్ధి చేసి కొనుటకు బ్రయత్నింతురు. రసజ్ఞులు కవిప్రతిభ గోచరించు భాగములనే యేరి దానివలన కవికి కీర్తి చేకూర్చి పెట్టుదురు.

ఈకవి కొన్ని గేయములువ్రాసెను. కొన్నిపద్యములు వ్రాసెను. దేశీయములైన శబ్దము లీయన మిక్కిలి వాడును.

ఈ కవియొక్క పరమమైన ప్రతిభ రమ్యమైన శ్లేషను గూర్చు టలో నున్నది. ఇతని శ్లేష కొన్ని ముదురుశ్లేషలవలె వెగటుపుట్టించక,

యది శ్లేష కాదేమో నన్నంత మెత్తగా నుండి దాని నలంకారముగాఁ జర్వణము చేయవలసిన స్థితిని దాటి, రసప్రాయమైన స్థితిలో నుండును.

"మందికొంపలు కూల్పఁగా వీరందఱు దక్షులై పుట్టిరి శంకరా!
ఒక్క దక్షుకై యెంత యుగ్రమూర్తివై తి విప్పు డే మయ్యెదవు?"

శ్రీరాముఁడన్న శీర్షిక క్రింద వ్రాసిన పద్యములు వానికవియేసాటి! మఱియొక్క డట్లు వ్రాయ లేడు. ఈ శీర్షికలో పద్యములు ఉదాహరణ చెప్పుటకుఁగూడ మంచిపనికాదు. ఐనను ఒకటిచూపెదను! లోకములో "స్త్రీలను హరిమధ్య"లందురు.చూలునిలచినప్పుడు ఆ పేరు కల్లయగునట! కాని కౌసల్య విషయములో కాదట! ఇట్లు శ్లేషించిన కవి యిదివఱకు లేడు. ఆపద్యములలో నొకటి యేమి? ఇట్టి శ్లేషలకు నీయన పెట్టినది పేరు. కొత్తకొండ వీరభద్రునిగూర్చి వ్రాయుచు అతని పదభక్తులైన వారు వీరభద్రాత్మకులట. కానిచో వీరు అభద్రాత్మకులట.

రెండవది యమకము. అదియు నీయనకు ప్రియమైన విషయము. మా నవవిధానవిజ్ఞానమహిమ మానవవిధానమునె పేరు మాపసాగె నట. ఇతని భావనాశీలము ఇంతమాత్రితో నాగలేదు. ఇదికాక యేవస్తువు తీసికొనినను చాలతక్కువ విషయము - దుక్కిబక్క - పరిగ పిల్ల- పాకీవాఁడు- పాదరక్ష- కాపు- రాటము- హరిజనుఁడు-గంటము, కల్లు, తేనెటీగ- గ్రామసూకరము- ఊరబిచ్చుక-ఎంపుగడ్డివేరు - ఇవి వస్తువులు. ప్రతివస్తువునుగూర్చి యేదో క్రొత్తకల్పనము చేయును. మన మనుకొనినట్లు చెప్పును. ఆయన యుత్ప్రేక్ష లుత్ప్రేక్షలవలె కని పించవు. అయ్యో యనిపించును. దుక్కిబక్కను రైతు హింసించెడి తీరు గుండెలో కొఱకంచులు పెట్టుచున్నది. ఆబక్క యిట్లనుకొను చున్నది. "నన్ను చెండెదరు, నన్ను రెండుగ చీల్చి తోలు గొనరాదా తొండపుతోలుకో, ముచ్చెలకో" పనికివత్తు నని.

పరిగపిల్ల తనతోపాటు చీమ పేరటాండ్రకుఁ బక్షిసమితికిఁ బంక్తి భోజనము పెట్టుచున్న దట!

పాకీవానిని గుఱించి యిత డేమి యనుచున్నాఁడు! అతని కుల వృత్తియందలి గౌరవము చేత వాఁడా పని చేయుచున్నాఁడు. "కులవృత్తికి సాటిరాదు గువ్వలచెన్నా"యని పెద్దన్నగారు నీతిగాఁ జెప్పినది యీ కవి కావ్యముగా వ్రాసెను.

"కని ప్రాణ మొక యెత్తుగాఁ జూచుకొను కన్నతల్లి కింతటి మమతలు కలుగునె?" అనును.

తృణమునుగూర్చి ఆరవపద్యము సీసపద్య మితని కవితాశ_క్తిని చూపును. పసిపాపఁ డన్న శీర్షికలో రెండుపద్యములు తాఁపీలు వేసినాఁడు.

'ఓరి పసిపాప' ఎందుచేతనో యీబోసినోరు చొంగ మూత్రముల మాఁగుచింపి నీ యందం దందమైనది. ముసలివారి యందం దందవికారమైనది? అని– మఱియు నీ గొప్పభావన చూడుఁడు–"గాలికి సందీయనీని పయ్యెదలో నిన్ను దాచుకొనునేమి? కఠిన_స్తనమ్ముల కరకునెత్తురులు నిన్గాంచి పాలై ప్రవహించు"నేల?

అన్నిటికన్న మిక్కిలి యందమైనది మఱియొకటి: ఆ పసివాని నోటిలో చనుబాల్గ్రోవిన వాసన గుప్పుమని కొట్టునట! ఓహో! ఏమికవి వయ్యా!

"గాంధిగారిని గూర్చి, రవీంద్రునిగూర్చి రెండుశీర్షికలు. గాంధిని గుఱించి– ఆయన కొక్కటే నాలుక యట. రెండు నాల్కలుగల కలమతనిగూర్చి యెట్లు వ్రాయును?

చంద్రబింబములో రాటమున్న దందురట. కర్మచంద్రుని చూచి నంత నది నిజమైన దట.

రవీంద్రకవిని గుఱించి పడి చచ్చిపోయెడువా రున్నారు. కాని యాయన పేరు నిట్లు సమన్వయపరచిన వారున్నారా? రవియై విశ్వరసమును గ్రహించునట. ఇంద్రుఁడై దానిని ప్రపంచముకొఱకు వర్షించునట!

శ్రీకృష్ణరాయలవారిని గుఱించి యాయనకీర్తి యష్టదిగ్గజముల వలన నష్టదిక్కులయందు నెలయు నన్నాఁడు.

అన్నింటికన్న హరిజనునకు వ్యుత్పత్తిచెప్పెను. అతనినిగూర్చి యే వర్ణమువారు మాకుపట్టదన మాకుపట్ట దనువారే. మఱియెవరికిఁ బట్టును? పరమేశ్వరుఁడైన హరికిఁ బట్టును. హరికిఁబట్టిన జనుఁడౌట హరిజనుండు. ఈ శీర్షికలో హరిజనాంగనలను గూర్చి వ్రాసిన పద్యములు చదివితీరవలయును.

ఇట్లెన్నియేని చూపింపవచ్చును. ఇప్పటికే గ్రంథవిస్తరమైనది. ఒకగ్రంథములో నున్న యందములే గుదిగూర్చి వ్రాయుట నిజమైన రసజ్ఞుని ప్రథమరసానుభూతిని గికురించుట. ఇట్టి యీ కవికి, నీ కృతిపతికిఁ జిరాయురారోగ్యైశ్వర్యములు పరమేశ్వరుఁడు ప్రసాదించుగాక.

బెజవాడ, } ఇట్లు,
10—3—45. } విశ్వనాథ సత్యనారాయణ.

# పండితాభిప్రాయములు

శ్రీమత్పరదేవతాయైనమః.

1. మణిమాల
2. వైశాలిని
అను నీ పొత్తములను,

క్షీరసాగరము
గవర్నరుపేట
బెజవాడ, 25-11-43.

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు రచించిరి. నాకుఁ గొంతభాగమును వినిచిరి. చాల హృద్యముగ నున్నవి. ఈయన రచనవలెనే చదువుట కూడ చాలమనోహరముగ నున్నది. విని మిక్కిలి యానందించితిని. ఈయనను ఆంధ్రకవివతంసుఁ డనవచ్చునని నాకు తోఁచినది. ప్రాజ్ఞులు దీని నామోదింతు రని నావిశ్వాసము. ఈ కవి వతంసునకు భగవంతుఁడు చిరాయురారోగ్యభాగ్యములు ప్రసాదించు గాక యని యాశీర్వదించుచున్నాను.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని.



బెజవాడలో నా మిత్రుల యింట నుండఁగా శ్రీ వానమామలై వరదాచార్యులవా రచటికి వచ్చిరి. నాకదే ప్రథమ పరిచయం వారితో. 'నేనేవో పద్యాలు వ్రాశాను. మీరు వినాలి' అంటూ చల్లఁగా గ్రంథం విప్పారు. ఇంకేముంది? అమృతభాండం బ్రద్దలైంది. సరిక్రొత్తభావనలు, మృదుమధురపదబంధము, ప్రసన్నత, అడుగడుగున ఉట్టిపడుతూ, హాయి హాయి యనిపించిన వారి రసవత్కవితకు చెవులప్పగించి వారి వంక తెల్లబోయి చూస్తూ, ఇటువంటి కవీశ్వరులు అజ్ఞాతంగా ఇంక నెందఱున్నారో అని యాశ్చర్యపడ్డాను. కవిత్వాలిని గూర్చి అభిప్రాయా లివ్వడం అలవాటు లేకపోయినా ఈ రెండుముక్క లనక తప్పిందికాదు.

గాంధీనగరము – బెజవాడ,
25—11—43.



ఇట్లు,
కాటూరి వెంకటేశ్వరరావు.



శ్రీమాన్ వానమామలై వరదాచార్య కవిచక్రవాకము.

గౌతమీనిర్మలనీలమధురజలాలు మందాకినీశీతలసితనీరాల దివ్యావతారాలే. సహ్యపర్వతాత్మజ గౌతమి త్ర్యంబకేశ్వరుని జటాజూటాల వీడి ప్రవహిస్తుంది. వాల్మీకి పరమపవిత్రామృతగాంధర్వం నాసికాపంచవటీతీరాన్నుంచి భద్రాచలపంచవటీతీరాన దరిసి రాజమహేంద్రపుర నన్నయార్యు కవితాకాంతిప్రవాహం అయింది.

ఆ మహాప్రవాహంలో ఉద్భవించిన ఒక సుందరశాఖాస్రవంతి వరదాచార్య కవికంఠము. ఆ దివ్యనదీతీరపుకవులు ఋషులు రసస్రష్టలున్ను. భద్రాచలానికి యెగువ దండకారణ్యపరిసరాలల్లో ఊగియాడు ఈ కవిగానము మధురమూ, నిర్మలమూ, ఆర్ద్రమూ, కాకపోవు టెట్లు?

భారతవీరులు యుగయుగాలవారు ఈ కవిగీతాలలో పవిత్రశ్రుతు లయ్యారు. జానపదుల ఉత్తమదైనందిన జీవనము వీరిరాగాలలో స్వరకల్పన లయ్యాయి.

ప్రతిభాయుతులు, యువకులు, సత్సంకల్పులు, దీక్షాపరులు, అయిన ఈ కవికొమారులు కొలదికాలంలో మహోత్తమకావ్యపథాలలో విహరించ బోతున్నారు. వీరి కావ్యాలు ఆంధ్రభారతీదేవికి దివ్యాలంకారాలుగా నున్నవి.

బెజవాడ, } ఇట్లు,
25—11—43. } అడవి బాపిరాజు



హైదరాబాదు ఛర్వర్డి—విర

అముద్రిత గ్రంథము "మణిమాల" పై "గోలకొండ" అభిప్రాయము.

శుక్రవారము సాయంత్రము హైదరాబాదు కృష్ణదేవరాయల గ్రంథాలయములో వానమామలై వరదాచారిగారు కవితనుగురించి ఉపన్యసించిరి. బిదురు వెంకటశేషయ్యగారు అధ్యక్షత వహించిరి. ఉపన్యాసకులు కవితను గురించి అపూర్వాభిప్రాయాలను వెల్లడించిరి. తరువాత తాము వ్రాసిన కొన్నిపద్యాలను శ్రావ్యముగా చదివి వినిపించిరి. వారి పద్యాలను సభ్యు లందఱు విని చాల ఆనందించిరి. పద్యాలలో మంచిశైలి, మంచిభావములు, అందమైన క్రొత్త వర్ణనలు ఉండినవి.



# విషయసూచిక





కృతిభర్త - వారి సతీమణి

శ్రీ శ్రీ శ్రీ గుండవరము జగన్నాథరావుగారు

జమీందారు

గట్ల నరసింగాపురము - నైజాము

# కృతిపతి వంశపరిచితి

గుండవరవంశ మౌక్తికగుచ్ఛ మనఁగ
ధర్మ మాచరింపఁగ మార్గదర్శకుఁ డన
సర్వమతసమహితుఁ డన శాంతిభూష
ణుం డనగ నరసింగరాయుండ మనితె ?

మొదటినుండి దుర్నీతిని సమ్మతియు లేదు
వాడు ప్రాణఘాతుకుఁ డని పలుకుచుండు
పెద్దకార్మతియే వచ్చి కీక సాక్ష్య
నీ వరసి పల్క పాడవే నిక్క మంబ !

దుర్మతిని నేడవ నిలయంబున మతియును
నాఁడవ తిథియందున హరి చేరినావు
అనద పెల్లగు నేడువ నాఁడువగను
గుండవరనరసింగరాయుండ ! సీస.

పల్లియముల సౌఖ్యంఁ బొందించి వనతటాక
కూపనిర్మాణముల బ్రజకున బ్రమోద
మొదవఁజేసిన నీదు దయారసంబె
యిపుడు మముగాల్చు శీతత్వ మిచ్చిలేక

వడుగు పెండ్లిండ్లకై వచ్చి యాచించిన
వారి కిచ్చితివి సంపద కొలంది
విసుగించుకయు లేక విడువని ప్రేమతో
నతిథుల నందఱ నరసినావు
కరువు కాలమున నాఁకట నేడ్చువారిని
బీదల రక్షించి వెలసినావు
బావులు చెఱువులు బహువిధోద్యానముల్
నిల్పినాఁడవు చాల నేర్పుతోడ
గోమహిష్యాదిదానముల్ కుటిలమతులు
గాని పెద్దల కిచ్చి నీలోన నెపుడు
హరికి సంతృప్తి గలుగుత మంచుఁ దలఁచి
యశముఁ గోరకయే పొంది తపుర! నీవు.

కోటి నష్టంబైనఁ గూడ మాటకు నిల్వఁ
బాటుబడెడు శుభ వ్రతుఁడు
తన పూనుపని విఘ్నతాడితంబైనను
మది ధైర్య మొక యింత మానని కృతి
ప్రజలు దుర్మార్గులవాక్కులచేఁ దన్ను
ద్వేషింపఁ దమి జేరఁదీయువాఁడు
ఎంతటి ప్రియులైన నేమి యొక్కించుక
యన్యాయ మొనరింప నలుగువాఁడు
పరులు తనవారు ననెడు భావంబులేక
యెల్లరును సుఖులై యుండ నెంచువాఁడు
చేతనైనంత యుపకృతిఁ జేయు, వైరె
యేని జెడ నన్న జింతించు నితఁడు ఘనుఁడు

వైరాగ్యమూర్తి గావచ్చు నీతఁడు కాక
బిడ్డ చచ్చిననేని వెతపడఁడొకో
నూరారులైన మానుసె న్వ్యయం బొనరింప
సత్కార్యముల నెల్ల నమయమందు

విద్యాభివృద్ధిచే వెలయువారలఁ గాంచి
మది నొప్పుమిగులు ప్రేమంబువాఁడు
డాంబికత్వము లేక టక్కుతనము లేక
పేదవేషంబున వెలయువాఁడు
హరికథఁ బురాణముల జెప్పునట్టివారు
మిగుల నుత్సాహు లగునట్లు తగిన శ్రద్ధ
తోడ విననేర్చు నట్టి సంతోషశాలి
గుండవర నరసింగరాయం డొకండె.

భార్య గతియించినను ధృతి బ్రహ్మచర్య
వ్రతముఁ బూని సంతానంబు వైపు జూచి
కామము హరిపదంబులఁ గ్రాలజేసి
నిత్యసంస్కృతి నార్జించి నెగడినాఁడు.

వేకువలేచి యెంతయు వివేకముతోడ గజేంద్రమోక్షమున్
శ్రీకరమై తనర్చు నరసింహకృతాసురబాలరక్షణం
బాకలిఁగొన్నవాడు పరమాన్నము మెక్కినరీతిఁ బ్రేమగా
లోకులుగూడ విన్చు మదిలోన జెలంగ బఠించినాఁడహో

బాల్యమాది గీత పారాయణంబుగాఁ
జదివి యాచరింపఁ జాలినాఁడు
న్యాయముగ ధనార్జనము జేసి కడు కష్ట
పడియు సుఖిసియోగపఱచినాఁడు.

జయము గలదు హిరణ్యవైరియును గాఁడు
సిరికి నాటపట్టగునట్టి చెలువు గుణము
నెలవు గలవాఁడు నరసింగ నృపుఁడె గాక
యన్యు లేరి ? యీకలికాలమందు సువ్రత !

తెగువయే పుట్టిన గుణమై నెగడునట్టి
వెలమకులమున నోపిక వెలయుటరయ

గుండవర నరసింగరాయండ! చూపి
నిప్పులోన బుట్టించితి నీటి సార!

పుత్త్రుల నిద్దఱన్ సుగుణపుంజములన్ భువియందు నిల్పి నీ
గాత్రము వీడి కీర్తి యను కన్యను నిల్పి మురారిపాదముల్
నేత్రము లుబ్బ గాంచుచు జనించిన భక్తికుమారికామణిన్
స్తోత్రమయామృతంబు నిడి తోరపుసంతస మందుచుంటివే!

అరయ ప్రహ్లాద రక్షణ మవనిలోన
ఆ జగన్నాథుఁడై భువి నవతరించె
నా హిరణ్యాదానాతిశయమ్ము పుడమి
శ్రీనివాస రూపమ్మునఁ జెలువు గాంచె

అతిధనాకాంక్షతో కవు లనవరతము
ధనికు నింద్రుడు చంద్రు డీతం డనుటలు
సహజమే కాని స్తోత్ర మిష్టమ్ము లేని
ప్రభు వితండు నేనుంగాను వందిజనుడ.

వర్షప్రదానమ్ము వసుధకై యిడు వేళ
సూర్యుండు మోమేల జూపకుండు
ధాన్యసంపద ప్రజాతతి కిచ్చు సస్యముల్
తలను భూగర్భాన దాచు నేల?
భూతకోటికి ప్రాణదాతయౌ వాయువు
తను వేల సుంతేని గనఁగనీదు
అఖిలలోకచరాచరాదుల కాయుం
బగు నాకసము దాగి యుండు నేల?
ఘను లెప్పుడును నాత్మస్తోత్ర మనిన యంత
మోము దాచుట సహజ మాశాంబుజాత
చారుసుమనస్సుమానసుల్ జగతి వ్యాప్తి
గాంచకుండ దాచగ శక్తి గల్గె వనికి?

ఒక మహావ్యక్తి సద్గుణ మున్న దాని
నున్నయటులు జెప్పగ విని యొప్పదనిన
మంచినే మంచి యనలేని మానవుండు
దేవునిని దేవుఁ డన వెనుదీయునతఁడు

ఒక్కొకచోట నాత డన నొప్పనివారును లేరె యన్నచో
నక్కట చంద్రసూర్యులిల నందఱ మెప్పును గాంచలేరహో
రిక్కలరాయనిం గని ధరిత్రిని తమ్ములు మూతిమోడ్చు మి
న్నెక్కిన భాను వైపు కనులెత్తియె చూడవు కల్వపూవులో!

ఆ నరసింగపురమ్మున
నా నరసింగసుధీకిం (బి)యాత్మజు డగుచుణ్
దానరసికతల మనమున
దా నరసి యుట జగదీశ ధరపతి వరలుణ్.

రత్నములవంటి గుణముల
రత్నప్రదీప్తాంగకముల రాజిలుచును దా
రత్నమ్మ కౌస్తుభాంకిత
రత్నము జగదీశు నెద మెఱయునటు లమరెణ్

అరుగ రాచకొలఁది మెఱుగెక్కి రత్నమ్ము
మెఱసియాడు నృపునిశిరము నెక్కి
యనుచు కాయ మెల్ల నా జగన్నాథుకై
యరుగజేసి యశము మెఱయ మనితొ?

ధర సువర్ణమ్మునందు రత్నమ్మె మెఱయు
సాధుతతి రత్న మన శిరసావహింతు(రి)
రత్నమొక్కటియే వెలె రహించి ధరణి
కాని రత్నమ్మ నవరత్నఖనిగ మాఱె

ఇంత లింతకూన లేమ్చుచు నుండనే
బాపె వారి నీకు పాపి మృతియు
చీమలగమి కింత చిచ్చిడఁ దేఁచిన
మృత్యువునకు లేవొ మృత్యు వరయ.

అనుకొనినంత మాత్రమున నట్టి మొగ మ్మఱియు న్భవద్విశా
లనయనముల్ స్మితాననవిలాసములు న్గొనఁబైన వాణి చ
చ్చినయటు లేనలేన్ల వడి చిట్కు-చిటుక్కున మట్టిచప్పుడం
చనడల దాసవర్గమును శాసనము న్పొనరించురూపు మా
కనులకు గట్టినట్టులగు కన్పడఁ బోవిక దైవదుర్విధి

ఏమువతనముంచి యాంపిన భర్తకై
యెనుగు రాత్మజు లలర జేసి
పలువురిలో కీర్తి వెలయింప గల్గిన
నలువుర నాడుబిడ్డల నొసంగి
యా జగన్నాథు పదార్చన విడనంచు
నా జగన్నాథు పదాప్తినొంది
రతనంబు తలనుండి జాలిపోయిన యట్లు
రతనమ్మ యిలనుండి జాలిపోయె

కడుపునిండ సంతానమ్ము గన్నతల్లి
చేతినిండ దానమ్మును జేసికొనియె
నోటినిండ మాటాడు నేపూటనైన
జగతినిండ సత్కీర్తితో నెగడె నాపె

జనకువలె నలువ జేదుల సమయమున న
కూరె భాగ్యావియోగమ్ము వీరికి నిల
జనకువలె పునస్సంసారజలధిఁ బడక
హరిపదాయత్తచిత్తుఁడై యలరు సతము.

అతని భావౌన్నత్య మాకృతి దాల్చిన
సుందరోన్నత హార్మ్య శోభ వెలసె
ఆ భావగాంభీర్యమున నద్దమటుఁజూపు
సరసవాపీకూపచయము దగ్గె
ఆ భావవైశాల్య శోభ ప్రతిఫలింప
వివిధఫలోద్యాన వితతి నెగడె
అతని హృదయాన్తరత దయావతారము లైన
పశుపక్షుల్దని వేలు బెంచి జేసె

యాచకుల నెన్నొ రీతుల నాదరించి
వడుగు పెండ్లిండ్ల నొనరించి వసతు లిచ్చె
పల్లియలనూళ్ళఁ బొందించి ప్రబలకీర్తి
నెల్లగతుల తండ్రికుమారుఁడే యనబడె

ఈతఁడె నీవెయన్న తలనిచ్చును యాచికి మంచిగాని యీ
యాతపుమాట రా నొకని యయ్యను గాచెడివాఁడుగాఁడు సు
మ్మాతఁడనంగ నొక్కపులియానని యచ్చటి ప్రాంతమంత వి
ఖ్యాతి నొనర్తు రెచ్చటను గాంచిన చుట్టుపదామడన్ జనుల్

చివ్వన నా శిరోఘటము శ్రీపదయుగ్మము చెంత వంచుచు
న్నెవ్వగ నార్తు లశ్రుచయనీరముతో నభిషేకమీయ ని
న్నెవ్వఁడురా కలంచు భయమేటికి లెమ్మన లేచి నవ్వులే
పువ్వులుగాగ నిచ్చు ప్రజ పూజయొనర్చును జగ్గశాస్త్రిభక్

ఈయన తండ్రి యాదశరథేశుని యట్టులె రామనామ్నుపా
రాయణమందె దేహమును రాల్చెను నీతని కాలమందు మా
నాయన సత్యభాషాప్రవచనమ్మున దా నచట స్వసిష్ఠుఁడై
పోయెను సర్వశాస్త్రచయపూర్ణుఁడు బక్తయశాస్త్రి పూజ్యతన్

వీరును వీరితండ్రియును వేనకువేలుగ విత్త మెన్నియో
సారులు పెండ్లికార్యమున సాయమొనర్చిరి మాదుతండ్రి కా
ధారము గాగ భూమికను దాన మొనర్చిరి మేల్ప్రహామ్మునఁ
గూటిచి రన్నదంగళవిఘూర్ణితరక్తము వీరి యన్నమే

పెండ్లి పేరంటముల వీరి యిండ్ల లక్ష్మి
దీక్షదాల్చి పవిత్రత దిర్గుచుండు
గణికలమటన్న మోమెత్తి గాంచబోదు
ఆసురాదుల వాసనకైన బోదు.

రాత్రి జాగరణ మొనర్చు రామకథల
దినము వేదాంతసుధల పారణ మొనర్చు
కృతులయిన త్యాగరాజుల కృష్ణలీల

బాడు సూరదాసుల బిల్వేంబంచి వంద
లాది కావ్యసుమాల నదర్చసేయు.

వీరి కుటుంబ మెల్లరును విద్దెలు బుద్ధులు నేర్చి నల్వురన్
బేరుఁ బ్రతిష్ఠగాంచిన వివేకవిశాలురె పుత్రు లల్లురున్
గూరిమి పుత్రికల్ సుగుణకోవిదుఁడా ననుజన్ముఁడాదిగా
జేరునె యీ సువర్ణమును జెక్కిన రత్నము దక్క నత్తయున్

తమ్ముఁడగు శ్రీనివాసాభిధానునకును
శ్రావ్యముగఁ బాడు గొంతుక సరసమైన
కైత నల్లెడి ప్రతిభయు గలదుగాని
యడచె వ్యవహారతత్పరతాంక్షియుగళి.

వారక సద్వివేకసుదివాకరకాంతుల గన్నువిప్పి సు
స్మేరముఖాంబుజాతమున జిందులు ద్రొక్కుచు నెప్డు సద్గుణ
శ్రీ రమ సుస్థిరమ్ముగ వసించుట జూచిన విజ్ఞలోకముల్
వీరికి శ్రీనివాసు డను పేరది సార్థకమంచుఁ బల్కరే?

అతులకళాపిపాసియు మహారసికాగ్రణి సంస్కృతాంధ్ర సా
హిత్యు లన ప్రాణమిచ్చు విన నింపగు తీయని శాస్త్రయుక్త ప
ద్ధతి గల గాయనమ్మనినఁ జాల్చు తలన్ స్మితభాషి యెప్పుడున్

ఈతని భార్య సత్యవతి యెంతయు సుత్తమశీల సద్గుణో
పేత మనోజ్ఞరూపమది పేరును సార్థము సేయు నాత్మసం
జాతుని వేంకటేశ్వరప్రసాదను నంగ్నని నొక్కటిన్ సదా
యీతడు దీర్ఘజీవియయి యర్థితసంపద నందుగావ తన్.





కృతికర్త:
శ్రీ వానమామలై వరదాచార్యులు
మణిగిరి.

# పండితవంశ పరిచయము

తొల్లి నారాయణప్పసుతుండు సింగ
రార్యుం డతని సూనుఁడు లక్ష్మణార్యుం డితని
నవరవాల్మీకి యనిరి రామాయణార్థ
ప్రవచనమ్మున కెద మెచ్చి పండితతతి

ఇతని సుతుఁడు వెంకయశాస్త్రి యెంతో మేటి
తర్కమునను వ్యాకరణ శాస్త్రమున నితని
ఛాత్రుఁ డారట్ల జగ్గయ సంస్కృతమున
వ్రాసె జగదీశచంపూప్రబంధ మొండు

ఈతడు తాను వ్యాకృతి నహీంద్రుఁ డనంబడె వారణాసిలో
ఖ్యాతి వహించు పండితులఁ గాదనిపించెను వాగ్వివాదమం
దీతని యన్వవాయమున నేడుతరమ్ములు వీరియింట నే
చేతు నివాసమంచు తొలి జెప్పె సరస్వతియందు రెందఱో

ఇట్టి వెంకయశాస్త్రికి పట్టి మాదు
తండ్రి బక్కయశాస్త్రి యీతనిని గూర్చి
బ్రదికి బక్కయ్యశాస్త్రి పురాణము విన
వలెను చచ్చి స్వర్గంబు పోవలె ననుచును
ప్రజయు లోకోక్తి నొండు కల్పన మొనర్చె.

ఒక్కమయిలు వినబడునటు
వక్కాణించు మధుగళరవపుసింహ మహో
బక్కయపురాణ మీన న
బ్బక్క ! యనంజేయు బుధులు పామరు లనకన్

నిక్కము వచింతు పాతాడి
పక్కయు నిలుచుండు చ టి పాపలుగూడం
జెక్కిన బొమ్మలవలెనే
దిక్కు గనక పిండు చెపని తియ్యని శోకమున్

మత్తమధుకరంబు మొత్తమ్ము లోక మఱు
ఝుంకరించు తేనె జాలువాఱు
గండు కోకిలములు కలహించు నొకసారి
పలుకు హంస లితని గళరవమున

ప్రత్తిపుచ్చినట్లు పండొల్చి చేతిలో
బెట్టినటులు కనులగట్టినటులు
వినుగులేక నింక వినిన బాగుగనుండు
ననగ నెంతో రుచులు తనర నుడువు.

సిద్ధాంతులకె యెంతో శిష్ట నిజాలు న
పారజ్యోతిష్కలాబ్రహ్మ యితఁడు
సంస్కృతద్రవిడాంధ్ర సాహిత్యజలధిలో
నంత మారసిన దిగ్దంతి యితడు
బ్రహ్మవిద్యాభాష్యభగవద్విషయ సూక్తిఁ
బయిచేయి లేదనబడె నితనికి.
పులిజూదమున వీరి గెలిచెడి మొనగాడు
పుట్టిరావలెనన్నఁ బొగడుటగునె?

పదితడవలేని వెయినూట పదియునార్లు
కావ్యబహుమతు లర్ఘవస్త్రములు శాల్లు
గొన్నవాడు నూటపదార్ల కన్న నెపుడు
తక్కువగ నాతని కిచ్చు దాత గనము.

ఇంతపండితుడయి యేమిచ్చినను గొను
నాసఁగొనడు పేదవేసముననె
మను నతమ్ము నిట్టి మాతండ్రి గర్భాన
నెట్టితపము జేయఁ బుట్టినామొ?

అరయ పండితవంశంబునందు నిట్టి
ఘనుని సుతులమై మూవురగ్రజులు నేను
బుట్టినందుకు గర్వించ నెట్టు లతని
జ్ఞానలవమె మాయందు నేమేనియున్న?

వీరికుమారు లందరను వేంకటనాథుడు పెద్ద వాఁడునుం
గూరిమి యెజ్జ యీప్రభునకుం దగు స్థానికపండితుఁడు నా
కారము దాల్చి విద్దెలిట గన్పడు ద్రావిడ సంస్కృతాంధ్రముల్
పారము ముట్టఁ జూచెఁ బరభాషలు నేరిచె నర్దునాంగ్లముల్

ఉభయవేదాంత శాస్త్రాళి నూహాసారని.
గణితశాస్త్రంబునందు నఖండశేము
షీధురంధరుం డెంచిన చేయి వాణి
గర్వమును జంపి డంబంబు గట్టిపెట్టి
యీ కలాతపస్వి మొగాన నిల్లుఁగట్టె.
బమ్మకుం బొమ్మగట్టిన పండితుండు
సకలభాషల జననియౌ సంస్కృతమున
మొక్కవోవని పదునైన యుక్కుతునక
విచ్చుతరవారివాదరవిధము దోఁచు

ఒక విద్యం బరిపూర్ణుఁడై మిగతలం దొక్కొక్క యల్పాంశసా
ధకుఁడై నన్ శశిఁగూడియుండు నుడుసంతానక్రియ న్వెల్గుఁ దా
నొకటం బూర్ణుఁడుగాక యన్నికళలం దొక్కొక్కఁత సాధింపఁ దా
సకలోడుస్థగితాంబరంబున నమాసం గన్న చందంబగున్.

నిండుఘుటంబు మాని కడు నిగ్రహజీవి యఖండధీవిశా
లుండయి నీఱు గప్పికొన లోపలనుండెడి నిప్పు, బోధనన్
బండను దొల్చి రత్నమన భాసిల జేయును వేంకటాఖ్యచే
నుండె మదగ్రసోదరుఁడు యోగ్యుడు నా గురుదేవు డిచ్చటన్

ఘనప్రవక్త బహుగ్రంథకర్త నాల్గు
బాసల ననర్గళముగ కవన మొనర్చు
ప్రౌఢకవి యాహిరీరాష్ట్రప్రభువరుఁ డగు
ధర్మరాజ సంస్థాన విద్వాంసుఁడితఁడు
నద్వితీయుఁడు నల్వురిలో ద్వితీయ
సోదరుండు లక్ష్మణనామ శోభితుండు.

చక్కని సంస్కృతాంధ్రముల సాగిన యీ కవిరాజువాణిలో
మిక్కిలి హృద్యమై రసము మీఁగడఁగట్టెను నల్దెసల్ చెవుల్

నిక్కడి యాలకించెను ధ్వనించ నొయారపు క్రొత్తకైత లిం
దక్కడ గొన్ని యచ్చుపడె నాగను గొన్ని ధనాద్యభావతన్.

నేనును జగదీశసదభి
ధాన తృతీయాగ్రజుఁడు సదా యనురక్తిన్
మేనులు రెండైనను గన
ప్రాణం బొకటియె యనంగ వర్తించితిమా

ఒక కంచమున భుజించితి
మొకమంచమునం బరుంటి మొకహృదయములో
సకలకల లభ్యసించితి
మకలుషితప్రేమగర్భితాంతర్యములన్.

సకలకలావిభాసితుఁడు చక్కనిగాయకుఁ డెంతో యందమై
న కలితసంస్కృతాంధ్రముల నాగరకుల్ గొనియాడ వ్రాయుఁ బా
తకములఁ దోలు నా హరికథాకథనమ్మున మా నిజాములో
నొక యసమానరత్న మన నొప్పెను నేరిచె నాంగ్ల మున్నుగా

కోకిలలకు మావికొసఁజూపి యూరించు
జుంటితేనె లాశ జూపు తేంట్ల
కతని గళరవమున హాయి సౌఖ్యము మొందు
నా తపము ఫలింప భ్రాతయయ్యె.

తనదు కూతునొసగి తండ్రి వెనుక తండ్రి
యగుటె కాక నాకు నన్నవస్త్ర
మిడి కవిత్వకన్య యెంతో విశ్రాంతిగ
నన్నుఁగూడఁజేసె నా శ్వశురుడు.

అతని యుపకృతిఁగొని యక్షరరూప కీ
ర్తనల దన కృతజ్ఞతలఁ దెలుపుట
నస్మదీయవాణి యాచంద్రతారకగా
నొక్క నూలుపోగు నుంచుటె యగు.

ఘననాగపురదా స్జగన్నాథ భాగవ
తు లనంగ చెన్నూర వెలయు నితఁడు
నితని యశస్సింహ మీ యాంధ్రదేశాన
నార్చి పంజావై చె నన్నిచోట్ల
ఈతని గానమోహిని తాను స్వర్ణంపు
టందెల గెల్చిన యాఁదగత్తె
ఈతని వాగ్దేవి యెన్నియో నగళుల
పుష్పవర్షమ్ముల మునిగి తేలె

రాగమును వ్యాప్తిసేయ హార్మనినిగాంచ
రాగమును దోచ దని వ్రేళ్ల రవ మొనర్చు
తాళమును వైచు నల్లె మృద గము గన
తాళ మీ ధాటి గని చేయి తప్పవేయు.

సువిశదవాగ్ఝరీమహిమ చుక్కల నాడెడి గాత్రకిన్నరీ
సవతిపికమ్ముపోలె సరసంపు బగాబగలాడ నూపులూ
పి విడిచిపెట్టి నూర్లప్రజ భేషన పల్లెలఁ బట్టణాలఁ గీ
ర్తి వడసె నెల్లదేశములు దిర్గి సదా హరికీర్తనాదులన్.

గంధర్వప్రతిమానగానము వినన్ గండెల్లునై కోకిలల్
రంధిం గానల మోము దాచుకొని యార్వ్వ న్మహానాస్త్రమ్మయై
బంధించం దన గానమోహినియొ సర్వా లట్టు లా శ్రోత్రలన్
సింధుప్రావృతభారతావనిని నర్చింపంబడె న్మేటియై.



# సమర కాళిక

బడలికఁజెంది గోద్విజులు బాలురు వృద్ధులు స్త్రీలు పూరుషుల్
పొడపొడఁ గార్చు నెత్తుటి రుచుల్ మదిఁ గోరికలూర నాలుకల్
కడలకు సాచు నా సమరకాళిక దంష్ట్రిలఁజూచి దద్దఱి
ల్లెడి నదె ధర్మదేవత చలించిన గుండెల బాదుకొంచహో.

నాడు మహాప్రశాంతముగ నవ్వులు నవ్వు చఖండలక్ష్మితోఁ
గాడగ రేబవళ్లిసుక గార్చిన రాలని యా నరాటవిన్
మేడల మిద్దెలన్ దివిని మేలము లాడు నగళ్ల దుబ్బుగా
ట్లాడెడి నేడు మచ్చునకు నైనను గన్పడ దొక్క యిల్లటన్

ఆరయ భారతావనికొ యన్నివిధమ్ముల చేయిబాచ కి
ట్లూరెడి పాడి పంట లవి యూరక యీయని చేతికందినన్
నోరున కంద దన్న మనసో యిపు డక్కట క్షామదేవతే
చేరిన మృత్యుదేవతకు చీకటి దొంగయు నేకమైనటుల్

భూగోళమంతటిం బోకచెక్కనువలెఁ
బుక్కిట నిరికించ బూను నొకఁడు
జలనిధులనె యగస్త్యభ్రాతచందాన
నాపోశన మొనర్చ నడరు నొకఁడు
వాయువు తనదగు వశవర్తియగుటకై
యష్టదిగ్బంధన మ్మరయు నొకఁడు
ఆకాశమునుబట్టి యటచేత తాండవం
బాడింపగా పాతరాడు నొకఁడు

అసలో యాకసపు తుదిమొద్దు దాటె
కాలమో నాల్గుగడియలే గడువొసంగె
గురిగిలో నాయువును బోసికొంచు వీర
లుందురో బ్రహ్మకల్పంబు లుర్విమీద.

మాయావియై మింట సేయు పోర నొకండు
సరి యింద్రజిత్తును జంపిపుట్టి
చంకబెట్టగ భూమిఁ జాపగా జుట్టుట
నా హిరణ్యాక్షు వియ్యంకుడొకఁడు
ప్రతిశ్వాసకును వేల ప్రాణులన్ బీల్వగా
కుంభకర్ణున కాదిగురు నొకండు

మాయలేడి వ్యాపారాల మాదుభార,
తావనీజాతలక్ష్మిని యపహరించి
జలధి దాటింప బందెగాఁ జేసియుంచఁ
దాను రావణబ్రహ్మకుఁ దాతయొకఁడు.

మందికొంపలుగూల్ప వీరంద రిపుడు
దక్షులై పుట్టి రొకసారె ధరణియందు
నొక్కడక్షుకై యింతటి యుగ్రమూర్తి
వైతి శంకరా! యిప్పుడే మగుదొ చెపుమ.

ప్రజలెల్ల విడిచెడి ప్రాణవాయువులట్లు
చలువవీవన వీచి శ్రమలు దీర్ప
కూటికేడ్చెడివారి గోర్వెచ్చ బాష్పముల్
వేడినీళ్ళుల తానమాడఁజేయ
ఆ జీవనదివోలె నాగని నెత్తురుల్
మత్తుసారాయి కై పెత్తఁజేయ
మృతశవమ్ములు తామె మెత్తనిశయ్యలై
యదుమశ్మనకును మదుఁగులొత్త

అట్టివై భోగరంగఁడై యనవరతము
మృత్యుకాళి దేశములనె క్రుంగసాగె
దాని నిర్జింప శాంతిదాతా! త్వదీయ
భద్రకాళికాశక్తిని బంపవేల.

ప్రకృతితో మాదు సంబంధతంత్రులు ద్రెంప
తంత్రీవిహీనయంత్రములు వెలసె
బస్సుపర్యాయాలు మా ప్రాణవాయువు లిగ్గి
దమ్మేనిలేని యీ తనువు లిచ్చె
జీవనజ్యోతులజిగిఁ బీలిచి మెలక్ట్రి
సిటి ప్రేతకళల నిచ్చె నిటు మాకు
అకట పెట్రోలు క్రూడాయిలు మా వీర్య
బల మిగ్గి జీవచ్ఛవములఁజేసె
మీాదు ధ్వనియించుచు విమానమే కనబడ
మీాదిలోకమ్ము మముఁ గొనిపోదు ననుచు
ఒక్కబాంబుగుండే యది యుర్విఁగూల
రక్కసియగు మృత్యువు గుండె రాయననలె.
మా నవవిధాన విజ్ఞానమహిమ యదియొ
మానవవిధానమును పేరు మాపసాగె
మా రణాస్త్రమ్ము లన్న నీ మహికి నిపుడొ
మారణాస్త్రమ్ములుగఁదామ మారసాగె.
అరయ రక్తధారల పదునందు క్రొలఁది
మిత్తినాలుక పదునెక్కె కత్తివోలె
చల్లబడునెట్టు లీ రణజ్వాల పుడమి
శాంతిభద్రతలకు నింక స్థానమేది ?
ప్రాణు లంభో యనుచు నేడ్చు బాష్పవారి
ధారలం బాఱు ఘోరనదంపు రొదల
ధరణీ యాకస మదధులున్ దనిసిపోయెఁ
గాని సమరకాళిక దప్పికయె యుడుగదు
భారతదేశపట మ్మన
నారయ గోరూపముననె యగపడుఁగాదే
క్రూరపు గోవధ మానమి
భారతదేశంపు టుసురు బాపుటెకాదే.

అకట స్నేహమ్ము గల్గి మీ యంతరాత్మ
జ్యోతియై వెలుంగుట ముందు జూడజాల
కని తెలుపనేమి దీపమ్ము కంత చమురు
గూడ బంగారమయ్యె నీ పాడువేళ

క్రూరహింసాత్మకమ్ముగా మారు పుడమిఁ
జక్కెరను బోలు తియ్యని సదయహృదయ
ములె లభింపవ న్విషయము మొదలె తెల్పఁ
జక్కెరది లభించుట లన్న స్వప్నమయ్యె

జర్మనీబాధ లడుగంటి చనెడుగాక
మన ప్రభుత్వమ్ము తలయెత్తి మనెడుగాక
మహిని సమరకాళికపేరు మాయుఁగాక
శాంతి భద్రతల్ మనుత విశ్వంబునందు.

## దుక్కి-బక్క

పొడ పొడ వేడినెత్తురులు చుక్కలు చుక్కలుగాఁగ రాల దో
సెఁడు బడె దండవుండు మెయ్యి చిల్లుల జల్లెడయయ్యె నింతకున్
బడలదు వాడి వీడ దిది పాడియె చూడుము కాఁపుబిడ్డ! నీ
పొడిచెడి ముల్లు కట్టి కెటు బోయెను కన్నవ యింత గ్రుడ్డిదే.

హాలము వడంక జొచ్చు నది హా యని యార్చెడి గాలిదెబ్బ నా
కలమును వెన్కబోవునది గార్చెడి యశ్రునదీహతిం గృషీ
వల యెదురెక్కజొచ్చు గడువాడిని నీ ములుగఱ్ఱయే యహో
తలఁపగ నాదు ప్రాణములు దన్ననుపో! యిది యెంత గుండెయో!

ప్రాణములేని బక్కమెయిపై నిటు నెత్తుటి దుక్కి నేసె నీ
పాణిని వెల్గు ముల్లలప బక్కయె నెత్తుటి మళ్లయందుఁ దాఁ
బ్రాణి దయాకృతజ్ఞతలఁ బాయని యోర్పను విత్తనాల నా
థాన మొనర్చె నా కనుల దార్కొను సిరిడి పెంతు వానినేన్.

కొంతైన దిట్టు వికారో గను సేద్యము సేయుచో? చేరఁగాడు నన్
రెండుగఁ జీల్చి తోలుగానకే యిటులింతటఁ గ్రుచ్చ బోకె నన్
దొండపు దోలు కోసి తుది ద్రొక్కఁడు ముక్కల కోసి వన్కరా
రుండుదు నంచు చింత నెద నొందుచు నశ్రుల గ్రుమ్మరింతునో!

బండెఁడు బొక్కలఁ బైవేసికొని యేని
తల వ్రాల్చి బురద నాఁగలిని దున్న
నిసుంత వదలక తా నా యింతి శక్తి నేన్
దాచక రక్తమ్ము ధారవోసి
పడుచు లేచుచును గంపెఁడు నొసఁగియుచుఁ
ప్రాణాలతో నీ పనులు దీర్చ
నాఁగజాలని బాధ లతిదారుణపు పోట్లఁ
దిని లేని సత్వము న్దెచ్చి కొనియు

నాత్మయా! లెమ్మటంచు బోరాడుచుండ
కాయమా! మొండి బారెయు కాళ్లుసాచి
జడమువలె బడె నవశమై సద్దుకొనియు
లేతు నని వేడ నోరైన లేకపోయె.

అది గ్రహింపక నీవు దానిదియు కపట
మంచు ముక్కలు మూయుచు నట్టె పటఁ
దోఁకఁగొఱుకు చాయపువట్లదాఁకఁ బొడుతు
నోరు దెఱ చేమొ యనఁ బోవు తీరున నది.

ఒక ప్రక్క మాడ్చు కొనుచును
సకలమ్ము నా నీకె యర్పణము సేయుచు న్నే
న్నకళంకత సాకిన దా
నికి నా ప్రతికృతము లిట్టి నిష్ఠురపు గతుల్.

మూఁడు బొక్కలె నెత్తురు నీవ కూఁడు జేసి
కొని భుజించితి వీ మిగిలిన రుధిరము
నీదు ములుగఱ్ఱ వనదంశనికరములకు
పాడుకాకి గ్రద్దలకుఁ బాల్పంచి యిడుకొ.

మనుసు నీ యెదకై పాప మనిపించి పాలిన్ని
విడువనెగాని తాఁ గుడిచె నొక్కొ!
అసువులు విలవిలలాడఁ దన్నుకొనుచు
నెద్దు గొట్టగ నిన్ను వద్దనియెనె ?
దయ విచారించి వదలినప్పుడే గాని
చేతగాదనియేని చెప్పెనొక్కొ ?
పొట్టనారగ నీవు పెట్టినంతయె కాని
నిండలేదనఁగ దుఃఖించెనొక్కొ ?

ఏమనుదు రైత! దాని దదేమొ కాని
మొదటినుండియు కష్టపుబ్రదుకె యబ్బ!
తలఁచికొన్నంతఁ బ్రేవులు తఱిగికొనెడి
నేమినేతు చేరెఁడు నీళ్ళ కేడ్చునింతె.

బ్రాహ్మణశిఖకుఁ దాఁ బరిమాణచిహ్నమై
యలరారు నీతల్లి యడుగు నెడము
కృష్ణ శిరోజాళికిన్ బుక్క జల్లెను
నీ మాత పదఘట్టి గోపు త్రొల్లి
పంచమహాపాప పటలాపహము నీదు
పంచగవ్యంబయ్యె పరగుగాదె!
శాంకరంబైన విశ్వంభరత్వమ్మును
నీ పెత్రికోనియె సై నిల్పితిగదె

అరయ బ్రాహ్మణోత్తముల్ సంధ్యాదికములఁ
భక్తి 'గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవ'తని
నిన్నెయులు వేల్పుగా నింట నిల్పుకొనుచు
పూజసేతురు గోమాత! పూతచరిత!



# పరిగపిల్ల

పండినపంటయున్ రయితు బండ్లకు బండ్లలు చేర్చి కొన్నపే
రుండిన గొయ్యికాలె మిగిలేమియు లేదు పొలాల నారగ
స్పందన యంచు నీవు నిటు దాగుచు నాడుచు నేరుదేమిరో
నిండుగ పైడి బొజ్జ జననీ! పరిగ న్లభియించు విత్తులన్.

త్రొక్క న్మ్రొక్కను బండ నేనియును విత్తుం బోవనీకుండ న
ల్దిక్కు ల్కంచెల నిల్చి కాళ్లొడిసెలం దీటించుచున్ ఉవ్వాధుగా
బక్కన్ బ్రాలగనీని కాంపులకు నీ భాగమ్మున న్మాత్రమో
దృక్కు ల్వ్రేయఁగనీదు దైవమిది యొంతే చిత్రమూహింపఁగన్.

చేతికందని యట్టి నీ చేరఁదన్ని
పరిగ గింజలలోన సాపాటు సేయు
నూరుచున్నట్టి యీ చీమ పేదటాంధ్ర
పత్నినమితిని బిలిచితె బంతిలోన.

కూర్చికూర్చి మెత్తఁజేసికొన్న గుమ్మి బొట్ట
కాపుపొట్టను నింపని కతమదేమొ ?
చింపులం గింజగాచ్చి నీ చిట్టిపోత
నీదుపొట్ట నెల్లప్పుడు నింపుటేమొ?

అందఱిని నీదు వైపున కట్టిలాగి
కొనెడి నీ తేట లోతు భావనల యెదద
దివిని సూర్యుని దనలోన దెచ్చికొనిన
చెలువులో వియ్యమందెడి చెలువ మేమొ ?

నీ పదతలముల నిఖిల స్వతంత్ర రా
జ్యములు గంతులు వెట్టసాగె నహాహా!
నిష్కామ మంతయు నీకంటిలోఁ బాప
పై దాగురింతల నాడఁ జొచ్చె

నీ సులభోచ్ఛ్వాస నిశ్శ్వాసముల యందు
        వెలలేని తృప్తి జీవించుచుండె
ఆ నిరాడంబర మన్ననో నీదగు
        చుట్టు కందని చింపిఁ గట్టువడియె

అమృతరసమాన నీదు జిహ్వాగ్ర మందు
దట్టి పరిగ గింజలకయి లొట్టె వేయు
మెత్తనా పరిపోచల నెత్తు నోడినా
శాంతియా వ్రాలి నిండు విశ్రాంతి జెందు.

అవధియె లేని యాశ యన నర్ణవ మందున నాటి నుండియున్
దవులుచు నీదులాడి యతిదారుణయానప్రయాన మొందు క
ష్టవ యిట. నిన్ను గాఢముగఁ గౌఁగిటఁ జేరిచి ముందు సాఁగఁ దా
నవధిగొను మేము నీదు సరళాంతర మారయ తృప్తిదేవతా!

ప్రొద్దుతో నీవును బోవుచుండిన యంత
        చెనలు మోములు మాడ్చి మసకలయ్యె
పరిమళ్లు నీ పోక నరసి నెత్తియు నోళ్ల
        ఝిల్లికారావాలఁ జేరఁ బిల్చు
ఈవు లేమికి తిండి నిచ్చగింపక వంతి
        పక్షులుం గూళ్లకుఁ బయనమయ్యె
పోవు చీ గతి నీవు త్రోవఁజూపనె చీమ
        పేరటాంగ్రమును బొక్క దూరుచుండె

చాలువు కాల్వ కన్నీట నేడ్చెడిని రొదల
పొలముగూడ నెంతయుఁ జిన్నబుచ్చె మొగము
అడుగు చుంటిని గడ్డియైన నాగకుండ
తిరిగి మొన్నాళ్లకీ చూపు పరిగపిల్ల!

ఎగురు తుఱ్ఱాయి పలె గాలి నెగయు కురుల
నిను నయాచకచక్రవర్తిని పటంచు
మాదు హృదయాసనమ్మున మాత! నిన్నె
యునిచికొందుము సరళజీవనము నేర్వ.

నిను. నయాచక చక్రవర్తిని వటంచు
మునుల చర్యలు నీ యందు మూర్తిఁజెందె
ఋషుల మొదలు నీవంటి యాకృతిని దాల్చె
కనికరపు ప్రేమ నీలోనఁ గలసిపోయె.



# పాకీవాఁడు

ఏయోధ కత్తి త్వదీయపాణిని గల శాంత్యసియైన మార్జనికి సాటి
ఏ వీరుడాలు నీయెడమకేల స్వర్గు మైల నెత్తెడి తట్టమాత్రమగును
ఏ రాజు వైరులు నెటుగానరాని నీ కలరా మశూచి ప్లేగులకు జోడు
ఏఘోరరణరంగ మెంతో దుస్సహపు నీ ఫాకిదొడ్డిదియైన యీఁకఁబోలు

బహుళ కోపాగ్ని గురియు నా బలము లెచట?
శైత్యశాంతప్రవాహంపు శక్తి యెచట ?
ప్రాణములఁ దిను రణజయరమ యదేడ ?
ప్రజల రక్షించు నారోగ్యరమ యిదేడ ?

ఐకమత్యాన లోకమలాపహృతికి
నడుముగట్టు నీ చీపురు పుడుకల గని
సంఘసంస్కర్త లుర్వి సంస్కరణఁబూని
తీర్పఁజాలమికిని సిగ్గుఁ దెచ్చికొనరె ?

కాల సృష్టియె యంత రోయుచు నసౌఖ్యానక్తి నత్యల్పభా
వాలిన్ దేలు నృజాతి యేడ? కనఁనె ష్ఠాచేయి యీచేయి యం
చాలోచింపక నెల్ల మైలలను ద్రోయఁజాలు నీవేడ ? నీ
వేలా మానవమాత్రుఁ డయ్యెదవు? కా దేతెంచితో యోర్పువే

ఆ యలసత్త్వముం దునుము నా వెను బొక్కన వంగి వంగి య
ట్లా యభిమానముం దరుగు నా శిరముం గని వ్రాలివ్రాలి యా
పాయని కార్యదీక్షకయి పాశ్చిపదమ్ముల నల్లనల్ల నీ
చాయగ వంటివచ్చి యిటు శాంతియె శాంతము నభ్యసించునో!

పొట్ట గడవ కీ వృత్తిని బూనితివని
తలచెదరు మాదృశదివాంధు లిలపయి నినుఁ
గాని పొట్ట కీ వృత్తియె కావలయునె ?
వసిని కాయగడ్డలు లేవె తినవలెనన ?

అనఘా నీ విటు వాయి గట్టుకొన నేలా ? తీవ్రదుర్గంధ రో
ధనమా కాదని యిట్టి సేవ పరమార్థంబన్నచోఁ బల్వు రీ
పని బూనం గరువౌను నాకు జనసేవావిత్తమ స్ఫీతి నా
కనఁగా నా కులవృత్తియే యనెడి నీక్షా ? యింక నీవాసనల్.

ఘన విజ్ఞాన లతావితానముల నీకై నున్న యీ తట్ట న
ల్లినవాఁ డెవ్వఁడొ యేమొ నేఁ దెలియఁగాలే నీ యనంతావనీ
జనవంద్యాత్మకథావిధానుఁడు సదా సత్యాగ్రహాన్వేషి వా
హినిసేనాని మహాత్ముఁడున్ గొనగుచుం డీ తట్టనే తాల్పఁగన్.

ప్రజలె నా ప్రజలను భావంబు గలయట్టి
రాజదండమున కీ తేజుగలదె ?
ఓనాథ నీవు నే నొక్కటే యను గృహి
ణికిని యీ కైంకర్యనియతిగలదె ?
కని ప్రాణమొక యెత్తుఁగా జూచుకొను కన్న
తల్లి కింతటి మమతలు గలుగునె ?
తృణమేని గురువని తెలియఁజేసెడి కవి
చైతన్యమున కిట్టిశక్తి గలదె ?
నివురు గప్పిన నిప్పయి నెగడుచున్న
పాకిసామ్రాట్టు! నీ ఋణబాధ నాకుఁ
దలఁచి కొన్నంత ప్రాణముల్ దన్ను మనుచు
కరఁగి మై రోమరోమము న్గంపమొందు.

జగతియె నాదునిల్లనుచు సర్వజనమ్ములు నా కుటుంబ మం
చగపడు చోట్ల నెల్లఁగల నా కసవంతయు నెత్తిపోయుచుం
దగ నిలునిల్లుసొచ్చి యతిదారుణ శాంత్యసిఁబూని దొడ్లలో
నగపడు దుష్టమూత్రమలినాదుల నే గతి పేరు మాపెదో ?

# తృణము

కర్ణుండు తన యొంటఁ గలదిచ్చెనే గాని
తనకుఁ దా నర్పించుకొనఁగలిగెనె ?
ఒకసారి తననిచ్చి యొడిసిపోయెను శిబి
మఱ్చకే నిగ్గిలెనె మాటు బెట్ట ?
ఎసఁగు దధీచి వెన్నెముక యుక్కయి వచ్చెఁ
దక్కిన దంత సార్థకపడియెనె ?
సుధ నిచ్చి సురల యుసురు నిల్పె హరి గాని
తనకుఁ దా నమృతమ్మై తనరెనొక్కొ
వీరు పృథివిలో నడిగినవారి కెల్ల
నొక్కపూఁటయపూట విందొసఁగిరేమొ
గాని యిటు తము నిడి నోరు లేనివారిఁ
బిలిచి యెల్లకాలము సాఁదఁగలరె ? తృణమ !

చెలికయి మోటుబారు సరకాళుల మే మతి దారుణాన నీ
సరసకు వచ్చి యూటవఁగఁ జాలక నీవు నిసర్గ కోమల
స్ఫురిత సుసుందరాంగముల ఖాంపడఁగన్ వడిఁద్రొక్కుచుందు మీ
వో రహిని మూఢ పాదరజ మూడిచి శైత్య మృదుత్వ మిచ్చెటే!
కాయపు రేణువేని విఠిగాఁ జనరాదని యుగ్రబాలతోఁ
బోయుచు నుంటివే మొ శిశుపోషణమాది యొకొక్క పోఁజతో
నీ యుపకారశీలతయొ నింపితె ? గోసతి రోమ రోమ మం
దో యసమానదానకరణోరచణమ్మ ! తృణమ్మ ! సెమ్మదిన్,
ఇనఁడె మదీయవంశజధరేశుల మించెనె దానమందు నీ
తృణ మని పచ్చ పచ్చఁగ మహీ న్నము నిన్నని కన్నగుట్టి దు
ర్జనతను నిన్ను నొందు తఱి సాగరుఁడే పయికెక్కి వచ్చి వా
నిని వడిఁగప్పి ప్రాణ మిడె నీ కిడుముల్ సుజనుం గలంచునే ?

అల్పకథఁ జేర తృణతుచ్ఛ మనుచు నెవుడు
నీచ విషయమ్మై పాటిగా నిన్నుఁ గొంద్రు
అట్టి నీచుల నొంప బ్రహ్మాస్త్ర మీవ
యగుదు రాముఁబో ల్పులహాస్త్రాఁ జేఁ.

కసిదీర గుప్పించి గంతులువైచు లే
గలకయి నాట్యరంగంబు వగుదు
మనసార మేసి రోమంథాల నిదురించు
పశువులకై పూలపాన్పు వగుదు
మెడ మెడ నొరయుచుఁ గడు చూడ్కులం గను
హరిణాల ప్రణయమందిరము వగుదు
ముత్యాలు దాపిన మొఖమలుఫరషువై
విబుధుల స్వైరంబువిడిది వగుదు
కదలకయె గంతు లిడెదు లేగలను గూడి
నిద్రఁ బుత్తు జో పాట యేనియును లేక
గుంపులుగఁ జేరి యేకాంతగోష్ఠి సేతు
తృణము వగుచు బ్రహ్మానందము నిడుచుందు.
తరుగనట్టి సిద్ధాన్నసత్రాలఁ బెట్టి
యనవరత మాత్మహస్తాల నతిథితతులఁ
బిల్చుచుండెద వత్యంతప్రీతితోడ
తృణమ! నీ ప్రాణవాయు వే మనసు గలదొ.



## పాధరక్ష

ధూళి యించుక బడ దుల్చి వైచెడి నీవు తానమాడెదు దుబ్బలోన నేడు
ఎండసోకినయంత నెంతొ కందెడి నీవు కౌఁగిలింతువు నిన్నుగాల్చుధరను
చీమగుట్టినయంత చీకాకుపడు నీవు ముద్దాడెదవు నూదిమొనల విపుడు
పచ్చిక బయళులఁ బండ గోరెడి నీవు నిండ్లగట్టెదు రాళ్ల ముండ్లలోన
ముందు నితరుల కరముల మొలకవోలె
పెరుఁగఁదలఁచు నీవిటు కాళ్ల నరగ నెట్లు?
నేను నేనని యభిమాన మూను పశువ!
పాదరక్షవై యిటు చచ్చిపడితి వెట్లు?

నేనె సుఖపడవలె నిలలోన ననెడి
యపుడో వరిముల్లె నీకు బ్రహ్మాస్త్రమయ్యె
జనుల పాదదాస్యము గోరి చనెడి నీకొ
కోఁతలును గుట్లు నందంపుసేఁత లయ్యె.

నిన్ను నీవ రక్షించుకో నేర్చునపుడొ
మూఁడు ముళ్లతో నెచటికి మొదలు గాక
పోతి చర్మమా! పరపదపూజయందొ
చేరెఁ దుండి విశ్వవ్యాప్తిఁ జెందు దీవె!

అనయము లోకసేవను మహత్తరకష్టము లేని లీలమై
ఘనసుఖతుల్యమై తనివి గల్గఁగ జేయునటంచు కిట్టు కి
ట్టను ధ్వని నద్గమంగునకు నాప్పుచు నాకడఁ జేరి యెంత చె
ప్పిన వినవైతి నే చెవిటి వెంగలినై శ్రమ నొంద ముచ్చెరో!

వితత పురాణమైన ప్ర
కృతిభాగవతమున గుతము నెప్పు వొనుచుచుఁ
బ్రతిపద మంటియు వెదకెద
వతిగూఢంబైన భగవదంశము రతా!

అరకాల మన్నైన నంటఁగానీయక సాకుట నీయండె సార్థపడియె
ఎపుడు వెంటంగొని యేగఁగాఁ దగినంత ప్రేమపాత్రంబవై వెలసి తీవె
తొడిగినచే కాల విడిచిన పంచనే పడియుండుటయును నీ కడనె కలదు
ప్రణయమ్ముతుదియెల్లపాదసంశ్లేషమేయనిచూపుటకు నీవ యద్దమగుదు

వలయునెడ చేతికి స్వచ్ఛి ఖలుల పైకి
దాడి జని బుద్ధి జెప్పుపాధ్యాయు వగుదు
విట్టు లెల్ల సంబంధము లీవ యగుచు
నఖిలజనభారము వహింతు వమ్మ రక్ష!

# పాలేరు

ఎద్దులే కావని యెంచిచూడఁగ జగద్రథము సాగించు చక్రములుగాని
హలముగాదది ప్రజావలికెల్లఁ దిన్పింపఁగలన్నమాతృసుపాణితలముగాని
కఱ్ఱుగాదది జీవగణకాయముల నిల్పఁగల యమృతపు జీవగఱ్ఱగాని
కాఁపువే నీవు లోకకుటుంబమునకెల్ల కాలమ్ము మను పెనుగాఁపువరయ

శిరసె నీది? భూచక్రంపు టిరుసుగాక
కేలె నీది యా చక్రంపు చీలగాక
వ్రేళులే యైదుప్రాణవృక్షాలయొక్క
వేరులగుగాని పల్లెపాలేరురాయ!

వడఁకింప నిను పుండువంటి యా చలి మీఁదఁ
బడి తానె వడఁకుచు వెడలిపోయె
క్రుగ్గింప నిను నిండు మండు వేసఁగియెండ
వడఁదాకి తను దానె యుడికిపోయెఁ
ఉఱుముల మెఱుముల నుఱికింప నిన్ను పైఁ
బడి కుంభవృష్టియె పాఱిపోయె
నీ ధైర్యనిధిఁగొన నిల్చి చీఁకటి దొంగ
వచ్చి తెల్లమొగానఁ జొచ్చె మఱుగు.

తలుపు గడెవేసికొని యిండ్ల దాఁగి బాఁగి
తలకు మమ్ముర్వి యూరక తలఁచిను కొట్టు
ఏమిజేయు నన్నివి యను చెదురుబడెడి
నిన్నొక్క కదలింప వింతయేనియు నిదేల?

విఱిచె ముండ్లనె నీ కాళ్లు మఱలఁబడుచు
నలగిపోయెను నీక్రింద గులకరాళ్ళు
అబ్బ! పాలేరు బిడ్డ! నీ యంతవాని
జూడలేదు పో పృథ్వి నే నేఁడఁ గూడ!

పాలేరు వగుట కలుముల
యాలును నీ పట్టి యయ్యె; యాపె నొసఁగి భూ
పాలుర యిలు నిల్పెద వ
ప్పా! లేరిక నిన్నువంటి పాలనకర్తల్.

కాదె నీ యెద్దుపోటు రక్తంపు చుక్క
నృపుని మకుటాన వెల్గెడి కెంపుముక్క
మసలు నీదగు నుదుటి చెమ్మటల చాళు
లధిపు నుదుట ముత్యాల కుచ్చుగుచు వ్రేలు.

చుట్టు మెత్తలగద్దె కూర్చుండఁగానె
సుఖము రాచరికమ్ముల జూడఁగలమె
పోయి ప్రొద్దంతయును దున్ని బొంత నొరుగు
పొలవు పాలేరు వెన్నుముకలనె యలము.



## పసి పాపఁడు

చివ్రురుల నీను నీ చిన్నారి రూపమ్ము
పితరులకా సూత్రతఁ బేనుచుండ
చెలరేగి యాడు కాల్సేతులేమఱక నా
స్వేచ్ఛోదధికి నీఁతఁ జెప్పుచుండ
తెప్పలార్చుచు కన్నులెప్పుడున్ నవవర్ణ
తిలకాలఁ బ్రకృతిని దిద్దుచుండ
బోసినవ్వుల నూరి పొరలు చొల్లైరు నా
నందాంకురపు పాదునం బదునిడ

ముకుపుటము లుబ్బ గురకుచు మోవి విప్పి
'ఊఁ' యనుచునూ నాఁయుంచు నుగ్గుగ్గు నంచు
నాల్క సంగీతకళకుఁ దానములు నేర్ప
మఱియు చుందువె? తొట్టియ న్ముద్దుబిడ్డ!

బోసినోరును చొంగయు కాసుకేని
పనికిరాని కర్మేంద్రియప్రతతి మఱియు
మూత్రముల మాగు చింపియు ముద్దుకూన
యందపుం జిన్నెలగుచు నిన్నులమె నేల ?

బోసినోరును చొంగయు కాసుకేని
పనికిరాని కర్మేంద్రియ ప్రతతి మఱియు
మూత్రముల మాగు చింపియు ముదుసలులకు
అంటరాని వికారములయ్యె నేల ?

పాపఁడా! సార్వభౌమ దంపతులు గాని
మహిని నిజు పేదలౌ నాలుమగలు గాని
చెప్పకుండనె నీ పనుల్ సేయుచిటులు
ప్రాణములు వీడు టీవన బానిసలయి.

గంజిద్రావుచు గంతల గట్టు నీవు
గ్రాసముల నేమి గొల్తు వీదాస తతికి
కొలువకున్న మావారను కొనెదెవీరి;
కొనకు నిను నీవ నేనసుకొనెదె చెప్పుమ ?

వేదవేదాంగము లెఱింగి వాదులాడు
వేత్తప్రజ ముక్కుచిరుపుల వెలితిగాంచు
అత్తపుత్తమాటల బ్రహ్మవేత్తనేని
పరవశునిఁ జేసి నీవా మైమఱుపఁజేతు.

పసిమిపాల బుగ్గల సొట్టబడెడి యట్టు
లద్ది యావంక నావంక ముద్దు గొనక
యాఁగలేరు నీవాదారి కడ్డె యడవు
పొత్తదేల ? యందఱికి నీ సొత్తుపైన ?

మంచిముత్తెములు వర్షించి నట్టులు పొంగు
పిల్లని చిఱునవ్వు జల్లులరసి
రవ్వలు నీలాలు రాలిపడ్డటు లుబ్బ
పుత్త్రుని కల్కి చూపులను గాంచి

వెండిబంగారిల్లు నిండినట్లు మరియు
తొట్టె నిండాడెడి పట్టెఁ జూచి
శ్రీ మహామేరువుచే జిక్కినటులెంచు
కొడుకు నెగుర వైచి గుత్తపట్టి
స్వర్గవీథులలోఁ తాను సంచరించు
నటులు భావించు నతుఁ దప్పటడుగు లరసి
సద్గురూపదేశమున మోక్షమ్ము వచ్చి
నట్లు మరచు మేనుగ్గునుప్పన నతండు.

ఒత్తికొనకుండ మెత్తని పొత్తియందు
తొట్టె తలకడ నినుపండ బెట్టి యూప
సరవి కాళ్లకడకె యెంతో జారివచ్చి
బోరగిల్లె దా భావమెవ్వారి కెరుక!

గాలికే స్పందియఁగా లేని పయ్యెద
నిను లోనఁగొని దాచుకొనెడి నేల
కఠిన స్తనమ్ముల కలుకు నెత్తురులు
నిగ్గాంచి పాలై ప్రవహించు నేల
క్రమము దప్పిన నాల్కగలుచునే నీతోడ
నుగ్గుగ్గనగ నేల నూరుచుండు
పృథగ నెప్పుడు పల్కు విన్నని పెదవి నీ
పిచ్చి నవ్వుల జవాబిచ్చునేల

అప్రయత్నమ్ముగనె యివి యన్ని నీకు
సాధ్యమయ్యెనె యీ యింద్రజాల విద్య
ఏమి యద్దిచిత్రమునఁ దెచ్చుకేవిధమ్ము
చెప్పవా మూకు దానినో చిట్టి బిడ్డ!

చనుబాల్ద్రావిన తావి గుప్పుమ్మని విచ్చుం జిన్నినోరార ! తోఁ
చినలేదంతము లొక్క రెండు గవరాఁ జెక్కిళ్లు గుంటల్పడం
గనఁగన్ సమ్మరపించు నట్టి శిశువున్ గడ్పార మోదాన గాం
చను పెంచంగను లేనివారిదియు నుజ్జన్మంబె యీధాత్రిలోఁ.

# మృత్యువు

కార్యమిది యకార్యంబను గణన లేక
మించి దుష్కపాతకాల చరించు వారి
నెక్కి కొట్టు భీకర నరకేశు డౌచు
కనఁబడుదె మృత్యుదేవత కనఁబడుదువె?
ఒక్కరికి సల్పవైరె నంత సర్వలోక
నెచటి తపస్త్రియు చాలదని చెప్పుచుందు
రకట పుట్టు నాతడు పుట్టినట్టులె యున్న
నేడ్పుగూడ వ్యవధి గాంచకేడ్వ దెమృతి!

---

# వీరపత్నీ విలాపము

ముదుసలులార! మీకిటులు మాతులు పండెను నుంతయైన ద్రా
పదిమొలలెక్కవే చెవుల ప్రత్తులు గ్రుక్కితిరేమి పల్కరే
రుదార యోసంగు నామెదుకు ముండ్లవి నాల్కలగ్రుచ్చనేయహా
కదలరు మీరు ప్రాణులో దుకాణమునం గల మట్టిబొమ్మలో

రాజరాజనర్షి

ఈవు మేన్వీడి ప్రాణమే నిత్యజించుచు
సాహసించితి వదియును సమ్మతించె
కాని నేను మేన్విడిన సమ్మాన మదియె
పోననుచు నార్చినను క్షమింపుము మఱుంది.

తొలియనసూయ నామగుడు దొంగ డొరల్లని మోసగింప జో
న్నలియని పిల్లచేష్టలని ధిక్కృతి సేయుదె వారి దుంపు దా
పాలఁతికి బొమ్మలాట్లయియె పోవదె మహానసుతుడు ణమ్మునన్
కలలనుకొందువే యకట! కావ్యకథాసతి ధర్మలీలలన్

మాఱియు గానదాయె మిము మ్మాదగు పావన భారతాన్వయం
బారువ జన్మ మెత్తితిరె యూరయ నేలిక పాము లట్టు లీ
ఘోరముఁజూడ లేక యొక గ్రుడ్డుకు కుండెఁడు గార్చునాడు క
న్నీరును కౌరవాన్వయ వి నింద్య దవాగ్ని సమూల మార్పదే!

ఇదో రజస్వలయైన యీ యింతి చీర
ముడి మొదలు రక్త వర్ణాల ముద్రితమయి
విప్పఁబడె మీ వినాశపు వీర గాథ
ముందు నీ నేలఁబడుట తో ముగిసి పోవు.

అకట! సీతా సతి పతివ్రతాగ్ని కొఱకు
పది తలల నెత్రు నేయి యై బరపె తృప్తి
కాని నాశోక దావాగ్ని కరవు దీర్పఁ
నొకతల నీది దేనిలో లెక్క మఱఁది!

పిడుగు పోటుల ముద్దు నిడెడి భీమన్న పె
న్గదా మిమ్ము వద్లుదం పదో కోపోర
కోదమ సింగపు క్రౌర పదు నిడు పార్థయ్య
యంప వర్షము జల్లెడాడదె మిము
మెఱుపు తీవెల తోడి పరియాచకమ్మాడు
కవల బాకులు చేటగ్గా జెరుగవె
క్రోధాగ్ని నురకక్రమింగుచు పొంగు ధర్మజు
మొసలు కన్నీర్మిమ్ము నెసరు నిడదె

మీశ్మశాన స్థల వఘుట వేశ్మమైన
యీ కురుక్షేత్రమే కుండ యడుగాగ
అస్మదీయ సంతప్త హృదగ్ని రవుల
ఖండ్లి బలినిడ భూతాళి పండుగనదె!

మానము చీరలాగుటయె మాపని యందువు దుస్ససేన! నీ
మానిని యశ్రులుందమను మల్చెడి భీముని గోళ్లనింకి నీ
లోనసె పెంట్రపేవులుగ లుంగలు జుట్టిన చీరలాగకన్
మానము మేమటంచును ప్రమాణము సేసెడి మన్నుఁబట్టుచున్

కత్తుల బోను లోన తిరు గంగల వట్టులై ముండ్ల కంప ను
న్మెత్తని శయ్యఁజేసుకొని మేన్పొరలింతువు మేటి వ్యాఘ్రపుం
గుత్తుకలోఁదలన్జొనిపి కుందక కందక వత్తువేమొయీ
మిత్తికి మిత్తి యౌ సతిస-మిద్ధరు పాగ్నుల నోడ గొట్టు దే

మాయజూదపు బోనులో వేయఁబడిన
అడ్డ సాళులనొబ్బక్కుల నాన గొలిపి
పంచ పంచాస్యముల చిక్కు పఱచి నావ
హా! సుయోధనా నీవయ సుయోధనుండ

అంధుఁడంధకారమె గన్న యట్లు గ్రుడ్డి
దొర నినుంగనె పాండు జాతులను మాప
కన్ను గలిగి దోషాతిరే కమ్ము కతన
గురు విదుర భీష్ములుండాన గ్రుడ్డి యైరి

ధర్మజా! విష్ణు ధర్మావతారమవయి
గదను భీముగ శార్ఙ్గము గాండివినిగ
అసినకులుఁగా చక్రమ్ము నంత్యానుజునిగ
జేసి ఫలు జేతులను రక్ష సేయలేవె!

## కురువృద్ధుఁడు

భర్గు వజ్రపు గుండె బరమ బట్టినఁగాము
విండులు నిను దాకి మొండి వడియె
ధాత "సేనాన్యుడా" దాట సీయని మేటి
మృతికి నీ జీవమ్ము మిండఁడయ్యె
హారితావలచి కిటియై యెత్తి ముద్దాడు
భూ సతి యోగడ్డి పోచయయ్యె
శ్రీ నాథుని యురంబు సింహాసనము సేయు
దండి లచ్చియు కండ్లనిండదయ్యె

భువిని నవతారమెత్తి భార్గవుని గెల్చు
నాఁటి శ్రీరామ శక్తి యీ నాఁడు నీకు
కరతలామలకమగు నీ ఘనతఁ దెల్ప
కనఁగ నీసాటి యెవరు శాంతనవవీర !

ప్రొద్దు మొఱంగె నీ వెడలిపోవుట భారతదేశమంతయున్
నిద్దురవోవుచున్నయది నీ చరితమ్మొక స్వప్నవృత్తమై
బుద్ధికిఁదోఁచు నేమియయిపోయెను నాఁటిదినాలు తాత మీ
దిద్దిన మీసలంగని నతిన్ వడఁకాడెడి ఖడ్గమో తెగన్
దిద్దెడి చిన్నవోయి పయిదేలెడి మాధగు మీసలియ్యెడన్.
నీకున్ముందును వెన్క కౌరవకులానేకావ నీ పాలు రీ
నీకీర్తింగనలేదు భారత సువాణీతారహారమ్మునన్
నీ కావ్యంబది మధ్య నాయకమణి న్నిర్మించె నాఁనాటి మీ
పోకల్ కస్తురి గట్టుగుడ్డ యయి నిల్పున్ భారతిన్ వీరతన్
ఆరయ కాలుఁడేని భవదాజ్ఞను గైకొనకుండ చేరువం
జేరఁగ నోడనే యొకట చిత్రజు మచ్చులమందు లేని ని
స్సారము లయ్యె నేకడుపు చల్లని తల్లులు నైన గంగ మా
భారతమాత జేపుచను బాల బలమ్మె కదోయి మల్లుఁడా !
కరవయి పోయె నీ సరిమగండని శౌర్యరమామతల్లి తా
దెరమరుగంటి యేడ్చెడిని తేకువ ప్రాణము సన్నగిల్లె సు
స్థిరతయె భూమిఁ బట్టెను కృశించిన భారతప్రాణి దేహమే
బరువయి తోఁచె స్వేచ్ఛపరపంచలఁ బట్టదె భారతావనిన్.
ఆలును బిడ్డ నొల్లక శరాగ్నుల నెత్తురుకేర్లె నేయిగా
వ్రేలిచి దేశసేవకయి ప్రీతి పరోపకృతిన్ యజింపఁగాఁ
గాలుచు కూలుమీ విమల కాయపుటస్థులు భస్మరాసులున్
బూలును బుక్కయాచు పదపూజ లొనర్పవె భారతాంబకున్.

రణము నందుఁజావ రంభసంభోగంపు
కతన బ్రహ్మచర్య ఘాతగల్గు
ననుచు నుత్తరాయణాగ మనపు పేర
నుత్తమిషగనిల్పి తోయుసురుల

ఆ సుయోధను విజయ వృక్షాభి వృద్ధి
జేయు రక్తమ్ము ధారవో సితివి గాని
కర్ణ దుశ్శాసన శకునుల్ గట్టి వేరు
పురుగులై లోన దొలువని గురిడు లెటులు

భారత రణమందుఁ జేరి నిరశస్త్రవ
తంపు దీక్షమనుసు దర్శనమ్ము
పండు బారు నీదు పడుచు కారుంగని
యొట్టు మరచి నాల్క లొట్టవైచె
అవిరళ బ్రహ్మచర్య మునకు నిండు జీ
వముఁ లూదె నెవని శ్వాసము లెడపక
నిష్కామ తాగర్భ నిలయాన బెరిఁగెడి
నెవని కన్నావలు కవల పగిది
ధర్మదేవత సహధర్మ చారిణి యయ్యె
నెవని చైదమ్ములు నెడద మెచ్చి
విష్ణు పాదోద్భవి వీచీ సుధనె వానిఁ
బోతఁ బోసెను రాజ నీతి గఱఁగి

నిష్ట వత్రయమ్మును నడ్డు పెట్ట లేని
విజయు గాండీవ మును శ్వాసె విడువ నీక
నెవఁడు పేడిని శరణుగాఁ గొనఁగఁ జేసె
నట్టి మాతాత నరమాత్రుఁ డగునె చెపుమ.

# భారతబాలుఁడు

సరిగా శౌర్యము చేవ బారదు మెయిఁగా శస్త్రాస్త్ర జాలమ్ము నీ
కరసంస్పర్శల నంది మచ్చికలు చక్కంగావు నూనూగు లా
మెరుగున్మీసలు నీదుపౌరుషకళ న్మేల్వన్నెలం దిద్ద వం
దఱి పోకట్లోక రేవు దెచ్చి భళిరే త్రైతక్కలాడించితో

అల గురు కర్ణ శల్య కృపులండెలు వేసిన చేతులా కురు
స్థలిఁగలవారి నెల్ల తలఁ దన్నిన దండి సిపాయి లంతవా
రలవడి గుండె కాయలె బరాబరి సేయఁగలేక హద్దు జా
ల్వాలె భవదీయ విక్రమపు వ్యాప్తినిఁ జెప్ప గదయ్య బాపురే!

అచ్చము పోరనయ్య కొడుకా నితఁడిప్పుడె ముందు ముందు వి
వ్వచ్చునె మ్రింగి పెట్టునన వాఁడఁట యొజ్జ సుభద్రపట్టి నీ
ముచ్చట విన్నమామెయినె ముండ్లయి నిల్చును రోమరాజి నీ
చిచ్చుర పిడ్గు విందులవి చేతుల నే మఱి యాటలాడెనో

దోరవయి వీరతాండవముఁ ద్రొక్కెడు నీ మృదుపాదయుగ్మమున్
గురుభువి ముద్దు పెట్టుకొనెఁ గుంకుమ లీనెడి కన్ను జ్యోతులే
మరక జిరించు నీయసికి మంగళహారతులిచ్చె నెంతయున్
బరువిడి వచ్చు శ్వాసములు పౌరుషవహ్నికిఁ బోసె నూపిరిన్.

కత్తి నాల్కకు వేడి నెత్తుటి తేనీటి
విందులు వేలు గావించినావు
పండ్ల నూరెడి వాడి వింట్లకు కార్జంపు
మేవాలనన్నియో మేపినావు
భైరవాకృతి దిర్గు బల్లెంబులకు నును
బ్రేవు కట్నములు గప్పితివి చాల
శివము దూల్చిగద చవిఁజూడ నరశిరో
నారికేళములు వందలు గఁగొట్టి

తట్టి నీ శక్తి మించు మర్యాద లంది
యవియె బలమిని పరుల హస్తాలఁ జేరి
ప్రీతి కృతిగ స్వర్గ విశ్రాంతిఁ బరపె నీకు
కాక నీవు చచ్చుటలన్న కల్ల గాదె.

చూచిన గుండె కెల్ల తల సోకగ నెన్నదురంట మొక్కితా
నోచిన దెన్ని జన్న దోనినుంబలె పుత్రుని గన్న యవ్వ యా
రాచ కొలంపు మాళి మణి రాజము గావెలుగొంద నిన్నె
కాణాచినిఁ జేసె భారత రణమ్మున నాయన చిన్ని యాదునన్

కన సుభద్రా గర్భ కమల ప్రవేశమ్మె
పరుష పద్మ వ్యూహ పథముఁ జూపె
తొట్టిలోఁగాళ్ల సేతులను నాడించుటె
స్వాతంత్ర్య సమరంపు సాము నేర్పె
పడుచు లేచుచుఁ దప్ప టడుగు వేసెడి కాళ్ళు
లాలీఢ పది నోన మూలు దిద్దె
చాల వేడుకఁ జన్ను బాలు గ్రోలెడి నాఁడె
యరి శిరమ్ముల నెత్తు రాన నేర్చె

సరిగ చనుబాల పదునార దరయనోట
హరిః ఓమని విలువిద్య నడుగ డెనెపు
డనుచు ద్రోణాదు లెంతని న్నాడి పోసి
కొసిరొ దృష్టి దోషమ్ము దాకునటుఁ గుఱ్ఱ!

వ్యూహమను పద్మ శర సంప్రయోగమునను
నాయనానినన్నె లాగెనా నారి రంభ
అరయ నారి యఁ స్త్రైరిడి నంత గుణము
కటకు ధనువు నేసియును లాగదెల నదెస

నీదు వాలు చూపులు శత్రు నికర మునకు
కష్ట కాలమ్ము నొక త్రుటి గ్గడపి వైచె
నీదు వాలు చూపులు బంధు నికర కష్ట
తర నిమేషమ్ము కల్పమ్ము సరి సలుపుటె

విత్తెను క్రీడి విల్లు జయ బీజము ధర్మజు మేన్బొలాన నీ
పుత్త్రుడి శ్రేట నిగ్గొలుకు మోమున వీర రసంపు వెల్లువల్
మత్తిడిదూఁకి పారితడి మార్చిన వమ్మెయిఁ బుల్కలట్టె మొ
ల్కెత్తెనజాత శత్రు జయమేయని చాటు జయ ధ్వజమ్ములై



## అడిగి లేదనిపించుకే యమ్మ నన్ను.

కొండొక కారణాన సుర కోమలి కండ్లకుఁ దోడునీడ యా
త్మ్మందు సుతుండు గన్పడక పోయిన బోవునుగాక నేఁడు నా
ఖండలసూతి యీ దురిత కార్యముకై యొడిఁగట్ట లోకమీ
గాండివి తానుతల్లికి మగండని నాపయి నువ్వ్మివేయదే?
క్రేవులలోనఁ క్రేవగుచుచుఁ జేర్మిని గొంతికిఁబొట్టనుంటి నే
నీవిధి నింద్రు వీర్యధన మిద్దియె నీ యుదరమ్ము జొచ్చిరా
నావలఁ బారవేయుదువొ యానని కడ్పునఁబెట్టి పెంతువో
యీవల పార్పుమందొ, వలపిట్టిదె లోకముగొడ్డువోయె నే!

ఉరక వంచిన మోమె యరవింద మగుచుఁ దా
నతను వింటికిఁ బ్రథ మాస్త్రమయ్యె
కట్టివైచిన నాదు కనులె నీలోత్పల
మ్మైనయా మరుని వింటి కతికికొనియె
దాఁచుచుండిన నాదు దంతపంక్తియె నవ
మల్లికలై కొంతు విల్లుఁగూడె
నిగ్రహించినను పాణిపదమ్ముగలివియె
చూతాశోకతతియై యనంగు నంటె

తల్లి నీదేమితప్పు నీ తనయు చెనఁటి
తనువెమరు ధనువై నిన్ను తావఁ బెట్టు
నట్టియీ మెయి పీడిసే నత్తను దైన
నతనికిని నీకుఁ గనుచల్వ యగును గాదె.

ఈ పనింగన నస హింష్ణుతన్ మండెడి
నాపాదమస్తక మగ్ని మేను
ఈమాటవినలేక నేగఁగాఁదలఁచెదా
ననిలుండు నాకాయమున నిలువక
కామ బీజమునకె క్కడ మొలకెత్తునో
యని మేననిగిరెర సాధిపతియు
ఇంద్రదత్తమను నేనిది సేయ నని నాదు
కొలువుఁ జాలించుకో దలఁచె తనువు

ప్రేమ వీరు మాయయ్య గు లాములయ్యు
నిందు నామాట వినువార లెవరులేరు
ఎవరిఁ జేపట్టి సేతునీ యిష్టసిద్ధి
యడిగి లేదనుపించుకే యమ్మ నన్ను.

ఎన్నటికేని పాపభరమెట్టులుదాగు ప్రపంచమంతకుం
గన్నులుగట్టినావె యదిగాంచదె రేయిబవళ్లు వేయిగం
డ్లన్ని జమాడదేమొ యెదుటన్ మనచాటునకేని తిట్టిపో
యున్నటియేరినోర్తునని యుర్విని బటగవచ్చు కామినీ.

జాతి గుణమెచ్చిటికిబోవు చాలుచాలు
తెలిసె మరియాద యెక్కువ పలుకబోకు
గణికవగుట దక్కితిశచీ కాంతెరయైన
పరశురాముగొడ్డలి తిర్గి పడునుగాదా.

కన్నుల దోషమో నరుడు గాడనుకొంటివొ నవ్వులాట
గా నెన్నుటొ లేక వెట్టితలకెక్కి పరాకుగమాటలాడుటో
కొన్ని దినాలు నీకు బ్రదుకుంగలదింతకు లేనిచో నినున్
దిన్న సుధాదులం వెడలదీసి యమాలయ మంపకుందునే.



# ఆంధ్ర ప్రశస్తి

శారద కాండ్లముఖార విందమున బొ
బ్బిలి జయశ్రీ తాండవించు నింక
ఓరుగల్ శిలలెన్నొ యొఱదీసి చూపెడి
మహిత కాకతి లక్ష్మి మచ్చుపిసరు
శిథిల హంపీ జయ సీమల క్షురములై
కర్ణాట సామ్రాజ్య కథలు వ్రాయు
యింతయేల దశదిగంతరాళ ప్రదీప్త
పూర్వాంధ్ర జాతీయ పుంబతాక

మశ్రు వర్షదాత్మకనీని కాంబు దముల
మెఱుపు తున్కలై యొఱయనే యుఱిమి యాడు
కవి కుమారుని ప్రోత్సాహ గర్జనంబు
వినియు తెలివింబడ విదెంత వింత! నిద్ర!

గండు మీసల నిమ్మ పండుగా సిల్చెను
బొబ్బిలి పులులకా భూవలయము
అంధ్ర బోజు పదాల నందియై యలమెను
కర్ణాట రాణ్మహా కనక వల్లి

ధన్యమ్ము సేయ ప్రతాప రుద్రు నుదిటి
కన్నుగా వెల్గె నోర్గంటి వసుధ
ఓయి సోదరా నీదగు చేయి నమ్ము
కొన్నకూలి కొత్తలఁజూచి కొనిమురిసెదు
ఇద్దియన వెనుకటి మీ యింటనొకరు
చేయిఁగడగిన పాటిగాదోయి తలఁప!
అరివహ్నినార్ప ముంగురులంటి జార్చిమ్మ
టలనే వలచె ముత్తైముల తురాయి
పిడుగులా బాకుల వడిపోట్ల నాపుడా
ల్గనియెగా ఛత్రమ్ము కన్నువేసె

మత్తారికరిఁజీల్చు కత్తిపంజా నోడి
సింగమ్ము లెత్తుకుర్చీ నిడె గదె
మొన లెంద ఊపి చూచిన నాజీ నదలని
పడమెకా సామ్రాజ్యపదము నాపె

చేతనాగ్ని రేపెడి ప్రాణవాత మాడ
కఠినమైన సామ్రాజ్య సంకల్పబీజ
ములను పక్వంబుసేయక ముందెపుడును
నాంధ్రరక్తంపుటెసరు చల్లారెనయ్య ?

కోఁతులదా మెసల్ దొరలు కోటులకుం బడగెత్తి యెంగిలిన్
జేతను గాకఁ గొట్టకను జేడ్పడి యుండియు మండి యేమి మీ
చేతికి నస్థు లున్న తొలిజేసిన మీదగు దానధర్మముల్
జేతుల నెత్తి సాటుచు, నచేతనమా శిల లేద్చు నేఁటికిన్

చిలచిల మైవ్రచ్చి చిమ్మపోసిన వేడి
రక్తాల రత్నవర్షాలు గురిసె
కంటఁ గూరుకు లేక కష్టించి యోడ్చిన
చెమటల ముత్యాలచ్ఛేలు పండె
ఘనకృషి న్మెఱపుతీఁగవలె సాగెడి మేనఁ
బైడి యేఱులు జాలువాఱె నెన్నొ
ఆత్మార్పణము సేయు నస్థిపంజరముల
వెండికొండలు గూళ్లు వెట్టికొనియె

అట్టి మా యాంధ్రు పాదమ్ము బెట్టు చోట
ఱాళ్లు రత్నమ్ము లయ్యెఁ గరాన మన్ను
ముట్ట బంగార మయ్యెను ముందు నట్టి
మా సరకు గానె వచ్చునే మాసరకును

పోతన్న యెద నవనీతమో ? వెన్నుండు
నరచేత చెప్పిన ట్లాడె నేమి
మొక్కవోవని యీశె తిక్కన్న కేలో ? రా
ప్పౌరుషశ్రీ కయ్యె పట్టుఁగొమ్మ

ఆ సూరన మొగంబె యమృతాంశుబింబమో?
కవితాకళాపూర్ణ మవతరించె
కంకంటి పాపని కంటిపాపయె వాణి
తగ రామచరిత కుత్తరము జెప్పె

పెద్దనార్యు బుద్ధి యదెంత పెద్దనవలె
వలచి యా సువర్ణమె కాళ్లఁ బట్టుకొనియె
నరయ నా బ్రహ్మయే నన్నపార్యు డేమొ
యతని శాసన మాంధ్రవాక్సతి తల నిడు.

చచ్చిన భీము మే న్మఱల సాధనఁజేసి గడించి తెచ్చి క్రొ
వ్వెచ్చని నూత్నజీవముల వేసి ఫలించెను నద్దమందు నా
నచ్చునఁ గొట్టి చూపిన మహాబలుఁడౌ మన కోడిరాము పే
రెచ్చట రే బవళ్లు దివిటీ లిడి చూపరు సూర్యచంద్రులున్

తా నాంధ్రు చేతియందముఁగాంచ శిల్పమ్ము
కోరి కొండల ద్రవ్వుకొనుచు రాదె
తా నాంధ్రుబాస చందము మెచ్చి కబ్బమ్ము
పదముల నీడ్గిలఁబడుచు రాదె
తా నాంధ్రు కంఠనాదము విన గానమ్ము
కడురాగమున వచ్చి మెడకుఁ బడదె

కలికి నెలవంక మోమువంకలను దిద్దు
పూర్ణశశినిభాక్షురూపమున వెలుఁగు
తెలుఁగునాటిపైఁ గనువైచి త్రిప్పుకొనఁగ
లేక నాలింగన మొనర్చి లింగమూర్తి
మురిసి ముమ్మారు గాంచఁడే ముగ్ధ డగుచు.



# హత్యావిచారము

కటిక కసాయిదౌ ఖడ్గమ్ము గూడఁ దా
వెనుక ముందాడదే విశసనమున
ఈ యమాయకపక్షి నెటు జంపు టని యమ్మ
నా బోయ కేల వెన్కంజ నిడదె
నోరెఱుఁగని లేళ్ల గాఱింతు నెటులని
బార్తుపాకీ గుండె పగులదొక్కొ
నేనెట్లు జంపు దీమీను బిల్లల నని
గాలమ్ము పెడమోముగా మలఁగదె
వాని మొనలందు పదు నను వాక్కు విందు
కాని నీకంట నది మందు కైన లేమ
అంకురించెను పదును నీ యస్త్రమునకు
చెనటి కటికవు నీమేన చెమట యున్నె?

దోషులు హంతకుల్ శుభముతో మనుచుండుట కేమి హేతువో?
మేషమ! నీమెడ న్దరుగ మే యని యార్చుచు వీరి మేలుగా
భాషణ సేతొ? మే యనుచు బల్కి సగమ్మున నాపుటేల? నీ
ఘోషము నల్లి యాపె నిను గుత్తుక నొత్తెడి బోయచేయియే!
కోరలు లేని బెబ్బులులొకో! నరునాకృతిఁ గొన్న మృత్యువుల్
తా రిల గాలుభృత్యు లవతారము లెత్తిరి నిన్ను మ్రింగనీ
తీరని నీ మనస్సునకు దెల్పఁగ నేగతిఁ బల్క నేర్తు నె
వ్వారెటు లేడ్చిన న్బనికివచ్చెడి ప్రేమము గాదికేమనన్!
నఱికి తినంగ మేఁక జననంబును బొందెనె? దానివౌ చనుల్
గురియవె పాలవర్షమని కుత్తుకఁ దున్మెడి కత్తి కండ్లకున్
గలుపఁగ బుద్ధబోధలను కంఠమునందున వ్రేలు చన్నులె
ష్ఠరయ మజాగళ స్తనము లర్థ విహీనము లంచు నా పరా
త్పరకృతసృష్టిఁ దప్పులను దార్తుము, తాతకు దగ్గు నేర్పుటే?

నీకే పాల్గలవాళ్ళా? పృథ్వివయి నెన్నె జంతువు ల్లేవె నాన్
మీాకై యౌషధు లెన్నియో మొదలె నా మేఁత న్బొనర్తు న్నిమ్ము!
వేకేనిన్ జ్వరమేని యొత్త నటు లెడ్డే నిట్టి పథ్యమ్ముతో
సాకన్ జాలిడు మాత లెవ్వరయ ? యీా సర్వప్రపంచంబులోన్

కత్తిని కేలఁబూని పలుగర్చుచు నాలుక సాచి యల్లె నీ
కుత్తుక నొత్తి పట్టి కనుగ్రుడ్డుల నిప్పులు రాలఁ జూచుచున్
దుత్తునుకల్ బడం దఱుగు దుష్టుని హంతకు జూడనే మొగం
బెత్తెద వేల! జేల యతఁ డెంతయు దగ్గరిచుట్ట ముంచుకో!

కనుల నీప్రతిరూపు జూనిపికొన్నంతలో
మాతృగర్భమువలె మనుచునని యొ
దంతపఙ్క్తియొ జిహ్వా దట్టి యొత్తినయంత
తినఁగూడ దని నీతి దెల్పు ననియొ
పడవేసి చేయి నీపైన వేసినయంత
జోకొట్టు తల్లి కేల్జోడు ననియొ
కరము కత్తిని తాను గఱచి పట్టిన యంత
కోయు కత్తిని నోరదోయు ననియొ

అసియఘం బిది యంతయు నని తలతువా
కావునన కొల్మి తిత్తివై కత్తి నెపుడు
సుత్తె దెబ్బల మెత్తఁగా మొత్త గాల్తు
వరయఁగా నీ నరుండె తా ననఘుఁ డనియొ
యట్టి నరు శుభకార్యగాయనము నందు
డోలు తిత్తివై శ్రుతిలయ లోలివైతు!



# కర్మచంద్రుఁడు - గంధి

ఆడునట్టి మాటనె క్రియ నాచరించు
నొక్కనాలుక గల నీదు నిక్కపుకథ
కల మదెటు వ్రాయు రెండునాల్కల మొగాన
కాని బలిమి సేసెడి దానిఁ గవిచపలత.

అరయ ముప్పదిమూఁడుకో ట్లస్మదీయ
భారతీయ సోదరదేవవీరతతికి
నద్రి కాంగ్రెసె యగుచు సత్యాగ్రహాబ్ధిఁ
దఱచి కర్మచంద్రుని వాక్సుధారస మిదె
గంధి పేర నద్దిశల సుగంధిత మయి
పత్రికలా నేఁడుగదె శుభపత్రికలుగ
నయ్యె స్వాతంత్ర్యపురుషున కస్మదీయ
భారతాంబతో వైవాహబంధ మొప్ప
చేసినదేమొ యీ భువికిఁ జేయఁగ నున్నదదేమొ పృథ్విలో
నీసరి మానవుండు కననే బడఁడంచును నొక్కిచెప్పు బొ
డ్డూసిన బిడ్డ నుండియు నదోయదో గాంధిమహాత్ముఁ డంచుఁ బే
రాసగ జూపు నీవనిన హాయిగ బ్రాణము లిచ్చులోకమున్.
నీదు శిరోజముల్ నలుపు నిగ్గుల నీనఁగ భారతాంబ సు
శ్రీదముఖమ్ము నల్లనయి చిన్నదనమ్మును బొందె నీ శిర
మ్మాదట పండువారు తఱి నామె యదృష్టము పండె నిండియా
పాదుగ నిల్పె నీదుతలపైని స్వకీర్త్యపకీర్తివల్లులన్.
ఓలిని చంద్రు శాంతవచనోక్తసుధారసమాన తోపుతో
టాలనుగూడ నింక నెపుడా యని నోళుల నీళ్లెయూరు వే
యేల వచించుట ల్తలపయిన్ ధరియించును గాదె చంద్రుపా
దాలను గాంచినంత నతిదారుణుఁడౌ ప్రళయంపురుద్రుఁ డేన్
కాసుల నాత్మసౌఖ్యమునకై గొన నీచెయి కాలుదండ మా
యాస గృహంపు దీపముల నార్పెడి పెన్నుడిగాలి నీ బుసల్
మీసలహింసకు న్దొరుగ నెత్తని కత్తియె నీదు నాల్క యా
మోసపు గుండెకాయలకు ముండ్లను గ్రుచ్చును నీ కలమ్ము తాన్.

లెక్క పెట్ట నగు నీ ప్రేక్షకయస్థుల నెల్ల
చిక్కన హైందవు చికుకు లురక
చాటిరచనగు నిరశనవ్రతపుం దీక్ష
నన్ను మెఱుఁగని భారతాంబసుతుల
మొదలించ నగు నీ మౌనవ్రతమ్మున
నోరు మూసికొనుచో భారతీయుఁ
గొలిచి చూపఁగనగు నీ కొల్లాయితో ప్రజల్
చుట్టుకొ నందని బట్ట చింపి

నింగినిం గాంచు చూరక నీ బొమముడి
భారతీయుల విడి యెడబాసి చనిన
హరిజనమ్ముల మలల తా నతుకువెట్టి
ముడినిప్పెచు నీ యవతారమున మహాత్మ !

చక్రవర్తిత్వ విశ్వంభరాభృతులు నీ
కేల నున్నట్టులె నా కేలఁగలవు
జనహృదాసక్తతృణ్ణావణ్ణమాత్రధారిత
నీ కేల నున్నట్లె నాకు నలరు
స్వాతంత్ర్యమున నేలఁజను పదమ్ములుగూడ
నీకున్నయట్టులె నాకు నమరు
పంచభూతత్వవ్యాప్తి సార్థకమకుఁ బుట్టిన జన్మ
నీకు నున్నట్టులె నాకుఁగలదు

అనుచు నీ మహాత్మత్వ సత్యాచరణము
చెప్పకయె చెప్పు నీదగు గొప్పదనము
కావున నె సార్వభౌముబో ల్లునుఁడు లేచి
తన కరస్పర్శయును సమాసన మొసంగె

దివినే కలఁడా భారతీయభాగ్యవిధాత
యని హిమాలయహస్త మంటి మఱియు
రత్నాకరమునుండి రాఁడుగదా యని
జాహ్నవిం గొంగుగాఁ జాపి యురక

పడకెడి భారతావని నుద్ధరింపఁగ
స్వార్థాత్ముఁడై యెదం బాలి నొంది
రాటంపు చక్రమ్ము రహిమీరఁగా సుద
ర్శన మాచు గుడిహస్తమున వెలుంగ

సవ్యహస్తాన కండెయె శంఖమట్లు
మనుచు గుణసూత్రములఁ జేసుకొనుచునుండ
నవతరించె సత్యాహింస లాత్మగాఁగ
శాంతరూపాన నిలఁ గర్మచంద్రుఁడగుచు.

అవతారములు నిండ్ల నద్దె గొంచు నెవాని
ముఖమున సంసారములను సేయు
వేదముల్ తమ న్యాయవాదిగా నెడి యేని
పలుకుత్రో యా మాయకలిని గెలుచు
మునిచర్య యే కరమ్మున మెదుంగుడువడి
యర్వాణ్మై జగతి పిల్పందుకొనియె
ధర్మమ్ము లేవని పాదాల పీడల దాము
తలదాచుకొనుచుఁ బెత్తనము సేయు

అకట యానంద భవనమ్ము యజ్ఞ మొగంబు
వాణినాలుక యగ్గు నేమొ వానినాల్క
ఆ కరంబే జగచ్ఛాంతి శ్రీకరంబొ
పదము లవియె ధర్మమ్మున కాస్పదము లేమొ?

చంద్రబింబాన నల్పుమచ్చ యదియేమి
యనినఁ మాపెద్ద లిది రాట్నమనుచు నుండిరి
యదియె యీ కర్మచంద్ర హస్తార్పిత మయి
నిజమె యనిపించు మాయెద నఖిలగతుల:

జగతి మానవె సర్వార్థసాధక మగు
నుడిని నీ మౌన మది నిక్కె యుద్ధ ఫలంబు
కాని పరమౌషధంబు లంఘన మన్నటునొ
త్పాదు ఉపవాసాల నొరులకు గుదురు రుజలు

# కాఁపు ఋణము

బండటు రే బవళ్లు తలఁబాతుక చాకిరి జేసిపోసి నీ
కండకుఁ గండల న్నెదురుగా నిడీ మేపెడి వెడ్డికాఁపు కే
మిండఁడ నంచు నీ చురుకు మీసలఁ బేనుచు నుంటివా బలే
దండి మగండవయ్యో! కనతల్లినిఁ బట్టుటె చేయిపెద్దగాన్

కాపుమే స్ద్రీపిరక్తాలను బీలిచి
యుమియుదే తమలంపు టుమ్మిగాగ
రైతు కవోష్ణాశ్రురసములం దోడ్కొని
వేడి నీళుల తాన మాడుచుందొ
కర్షకు మేన్గ్రొవ్వు కరగించి మరగించి
యభ్యంగనమ్ముల నంటుకొనెదె
సేద్యగాని మెడంద చిచ్చిడి చుట్టగా
నుప్పని పొగఁ బీల్చి యూదుచుండె

పరమ ఋషివంటి కాఁపును బట్టిమేన
నుండు సారయ మంతయుఁ బిండి పీల్చి
పిప్పిఁ జేసి ప్రాణములను బీకి తినుచు
నంగరంగ వైభోగము లారగింతె!

నీరధిన్ గెరటాల నిదురఁ బోనీయదు
సూర్యునో నీడ గూర్చోనఁగ నీదు
నిట్టూర్పుతో గాలి నిల్వ దొక్కెడ నెప్డు
మేఘాల యెద నదే మెఱయు నుఱక
కాల రూపమ్ము తా గడగడ వడఁకును
తపియించును ఘనాశ్రుధారఁ గార్చు
ఇలపోట్లఁ దిని ప్రతియేఁట కొంచెము దీర్తు
నని కాఁపు కాలంటికొని విడువదు

పైరులు వసుధ పొట్టలోపలఁ దలనిడి
మెట్లొ తలక్రిందు తపములసేనిఁ జేసి
ఋణము జన్మజన్మాల కే నీగలేవు
నీవు నిశ్చింతగాఁ బండి నిదురపోదు

రెండు బక్కలు సత్యవంతుండు కాఁపు
పుట్లు పండించి రాజనా ల్పుడమి నింపఁ
బోయి కొలఁదిని నడ్డుకె పోవసాగె
నీదు కోర్కుల గుమ్మెట్లు నిండునన్న ?

రేయిఁబవళ్లు కంటిపయి రెప్పనువేయక నెత్రు నీరుగాఁ
జేయ ఫలించి నీదు నిలుఁజేరిన విత్తులఁగాంచి భాగ్య మా
హా! యిటుపండెనంచు నుదురంటెదు పూర్వమె కాఁపుచేతులన్
గాయలు గాసి నిన్ను తలకాయను బండెను నీ యదృష్టమో!

---

# ర వి క వి స్మృ తి

రవి నగుచు గ్రహించెద విశ్వరసము లెల్ల
నింద్రుఁడయి సుధగ దాని నిత్తు ధరకు
నను జగజ్జీవనాధార మగు వెలుంగె,
యా రవీంద్రుల నొకపేర నతికి చూపె

రవి వగుటన్ భవత్కృతులు రాజిలు విశ్వతమోపహారప్రభన్
దవిలి మహేంద్రుఁ డౌట నమృతమ్మగు నీ కృతులెల్ల నన్యమా
నవకృతులిట్టె వెల్గవలెనాఁ బ్రతివాఁడు రవీంద్రు డెట్టులోఁ
బవలె రవీశుఁ జూపుటకుఁ బట్టిన కాగడ నా కల మ్మిటన్

పుట్టినొ పుట్టలేదొ నినుఁ బోలు మహాకవి భారతాంబ కె
ట్టెట్టులొ చుక్క రాలిపడెనే యనుకొంటిమి నీ వదృశ్యమై
యిట్టులు నామె యేడ్వ ధర నింకి గతించెడి కంటిధారలో
బుట్టిన నీటిచుక్కవయి పోదువటంచుఁ దలంప మింతకున్

బడుఁగుకొండల గుండె బ్రద్దలౌ మెఱపుతో
మబ్బుటారటాళ్లపై మచ్చు గీసెడి వెల్గు
చీఁకటుల హృదయాలు చిల్లులు బడ న్మినుకు
చుక్కమాటున తొంగి చూచినను నా వెల్గు

సాగరుని నాడులే చల్లబడి యార్వంగ
శరమటులు బడబాగ్ని గురిఁజూపు నా వెల్గు
విశ్వనాథుని జటావిమలపీఠిక నెక్క
చందప్పలో వెన్కముందాడు నా వెల్గు

ఆ వెలుఁగె సర్వదిశ లాక్రమించుటకు
రవి మొంగములోన పూర్ణప్రసవ మొందె
విశ్వకవియై సుధావృష్టి గురిపించి
భువిని చిత్రించి యా దివిని వెల్గించె.

దివి భువులం గ్రాలు తీయని సారమ్ము
తల్లి చన్నాలతోఁ ద్రాగఁజేతు
వందటి న్నాబముల ట్లాడించు గీతాల
నుయ్యాల చెవిలోన యూదుచుందు
నఖిలమానవకోటి యజ్ఞానగతి బాలుఁ
దప్పటడుగుల తోనె చెప్పుచుందు
వాగమమ్ముల కిట్టి దనరాని తత్త్వమ్ము
ననరాని శిశువాక్కు లందె కూర్తు

పడుచు నజ్ఞానజలధిలోఁ జెడకుమంచు
పడుచు ప్రేమనే పోలిచి పలుకు చుందు
పండుకొని ప్రమత్తపు నిద్ర నుండకు మని
పండు ముదుసలి నడకల పిండి పోతు

సత్కావ్యమంటు నా సరసత విరిదమ్మి
తేనె పొట్టల పిండి తేనె యనఁగ
బావస్థ గంభీర పద్ధతుల్ సాగరు
నడుగును గుత్తగా నడుగుచుండ
నుడికారముల కమ్మతడి బాద మక్రోటు
పలుకుల నోల్లూరఁ బల్కుచుండ
కొంగ్రొత్త శైలి నా కూర్పాణి ముత్యాల
వరుసతో వియ్యాలవరుస లాడ

## రవి కవి స్మృతి

భూతలం బంతటికిని నీ కైతల తడ
ఘనతరాగ్రధ్వజావాప్తికై తలనిడ
నెల్లదెసలు నా రవిక్రింద తెల్లవారె
తెచ్చియిడిరి నోబుల్ప్రైజు తెల్లవారు !
భూగోళమంతటఁ బున్నమవలె వెల్గు
కీర్తియై తలయంత పూర్తి నెఱసె
జ్ఞానాబ్ధి లహరీ వితాన మీ కవిచంద్రు
ముద్దాడు నన మోము ముడుతలువడె
వాణిదౌ భాగ్యమ్ము ఫలియించెనో యన
పైడిమే న్నిండార పండువారె
గురుదేవుఁడను దొడ్డ బిరుదిచ్చుటనె వంగి
వర్తించు నన మేను వంగె ముదిసి.
తెల్లబడి యెద దాటి యేతెంచి పెరిఁగి
దాడి సని తెల్లవార్ధి యెదల జయించి
రహిని భారతదేశ భారతీశిరాన
బిరుదుల తురాయిఁ గూర్చె నీ బిరుసుదాడి.

రవిరూపమున నీ ధరణి క్రిందిలోకాల
పారలించి చూతువేమో యనుగుముట్ట
నింద్రరూపమ్ముతో నేగి వెయిగండ్ల
స్వర్గాదిలోకాల చంకనిడి చూతు
వా రవీంద్రుండవై యీరేడు లోకాల
యంతరంగా లెల్ల నరసికొనివచ్చి
అరచేత తెయ్యమని యాడించి చూతు
సరిగమలఁ బాడించి శ్రావ్యముగ విందు!

ఆ పువ్వు నవ్వెడు నానంద మేదో
వృక్షాలు తలలూపు వృత్తమ్ము లెవరివో
ఆ గాలి పరువులకు నాతురతపను లేవో
ఝరుల ఘూర్ణన మెవరిఁ గని కరఁగి నీరగునో
అడుగడుగునకు నీవో యడుగుచుండెదవు.

పదములన్నియు నీదు పదములను బట్టుకొని
చెప్పిచను నే నేమి జెప్పవలె సుకవీ!
వెండి తీవెల గేరుచుండు నీ ముంగురులు
వద్దనంగ ముద్దులిడు వదనమ్ము జుట్టుకొని
చిత్రప్రకాశము నీకుం జేకూర్చు కిరణాల
వలె నగుచు రవిని వ్యర్థపఱచు గదె
శిశువుపై చనుబాలు జిమ్మించుధార
పడుచులోం బొంగు యౌవనసుధాధార
రక్తాల గ్రక్కు నుగ్రపు ఖడ్గధార
దుఃఖాగ్ని నాజ్యమై దొరలు బాష్పపుధార
త్వల్లేఖినిని జీవధారగాం జేసికొని
ధర నీదు సుకవితాధారయై విరిసె.

మేఘాలమాటు నీ మై దాచుకొనితే?
అస్తాద్రి తనయింట నాపివైచినదా?
రాత్రి గర్భము వెడలి రాకయున్నావా ?
గ్రహణ వదనపు బందెఖాన నుండితివా?
రావె పూర్వస్థలికి నీవో రవీశ !

దివ్వె క్రిందనే చీంకటి స్థిరమై నిలుచుండి
తైలముడుగు కొలంది వెల్గు తగ్గంజేసి కడకు
దిగమ్రింగెడు గతి కాళ్ళ యడుగుజాడలలోనె
తిరుగ మృతియె కాలగతుల మరుగుపఱచ దేవని

పండిరాలినావు మాదు భరతభువినె నీవు
రాలిన ఫలబీజమటనె తేలి మొలచు ననుచు
ప్రతిమొలకయు ప్రకృతి హృదయభావ మెఱింగివచ్చి
పచ్చనాకు తలపైనిడి బాసంజేసి నుడువు.
పడవైచె నొలిచి సంతాపంపు తొక్కయటులు
సంజ మబ్బును వేతె నీదు చక్కనిమదిమైని
సరసాత్మను ఫలముంగ నస్తాద్రి యొసగించె
యిముడునె యోరవి పూర్వపుటింట బుట్టుగాని.

# రాటము

రాటమా! నీకదురుతో నిరంకుశగతి
వ్రాయు ధవళధారాచ్ఛప్రబంధసూత్ర
ములకు నర్థమే తెలియక కలమొ తాను
నల్లమొగము వైచిన దే మనాదు ముందు
కాని నల్లమొగాలకే కళల నీయ
రహిని యా రాట మొందు నా రాట మనుచు
తెలిసికొనెనేమొ నీ పదమ్ములకె సేవ
సేయనెంచి తా ముందంజ వేయసాగె.

యంత్రపు మాయమారు లదె యార్చుచు బుస్‌బుసులాడు చేమొ దు
ర్మంత్రము లూది మిమ్ముఁగని మారణహోమము సేయ నెంచి క
న్పింత్రిటు వారి కడ్పుడుక నిప్పులు గ్రక్కుచు భారతీయు స్వా
తంత్ర్యపుజీవగఱ్ఱ యిది చావదటంచుఁ దలంప రింతకున్.

ప్రాణము రక్షసేయగ కృపాణమొ బాణమొ యక్కరంబడుం
గాని యిదేమి? యీ కదురు కైవసముం బొనరింపనేలనాఁ
బ్రాణముకంటెఁ దీపి యని భావనఁ జేసెడి భారతీయ స
న్మానము రక్షసేయనె సుమా యిది వానిని జంపిపుట్టెపో.

జాతీయభ్రాతృమస్తకపునిచ్చెన వైచి
సుఖసౌధముల నెక్కి చూడఁగలమె?
భళి సువాసినుల మంగళసూత్రములఁ ద్రెంపి
దాస్యంపుబంధాలిఁ దప్పగలమె?
మహిళామణుల కుంకుమలచుక్క మల్పిన
తల నదృష్టపుతార వెలుఁగఁగలదె
అనదలౌ కూనల యశ్రువర్షములతో
శత్రుదావాగ్ని తా సమయఁగలదె.

యనుచు హరిహరాజులవౌ రథాంగశూల
ములును యజ్ఞోపవీతము గలసి తాను
రాటముగ మారి మహిని పోరాట మార్పి
శాంత మొనఁగూర్చు నా కర్మచంద్రహాస్త
గత మగుచు నా మహాత్మ్మ సమ్మతిగఁ దిరుగు.



# ఘ నో ద్దే శ్య ము

చొక్కపుపసిండిమైదీవ సోకుకొనుటఁ
గొట్టవచ్చు నీలపురంగు పట్టుకోక
మేలిముసుగుగాలి నొకింత దూలియాడ
కనుల మిరుమిట్లు గొల్పునే కన్నె మెఱపు.

స్త్రీ శేలయనుచు నెంచితి
బాబో యటు గాదు ఘోరపర్వతశిరముల్
రాబోడిఁ బట్టఁగ వచ్చున
బాబగు ఘనరాట్టు చేతి వజ్రాయుధమా.

అరయ పూర్ణాయువున పొలిమెరను జూప
నెన్నినా ళ్లామెనో కొండఁ డిట్టులుంచు
నింద్రియవిజేత యైన మానీంద్రు పగిది
సంచలింపఁ డెంతయు నెండచలువ వలన.

ఎన్నఁడొకరి జోలికిఁ బోవఁ డితఁడు నల్ల
నితఁడు తెల్లనఁ బోవఁ డీ ముతుకతపసి
కాని యేటికో యిటు లగ్ని కనుల రాల
నుఱిమిపడు నీ నగేంద్రుపై నొక జలదము.

జాలం గొట్టిన చావు లేని ఘనదీర్ఘాయుష్య మే మాత చ
న్బాలం గల్గెనొ యుద్ధరించి తెవనిన్ వ్యర్థాతిభూభారమై

నేలం గూలియు పృథ్వీఁబెద్ద నొక నేనే యంచు నాకాశసౌ
ధాలం దాక తలెత్తి చూపెదు ఘనాధ్వాంతర్నిరోధక్రియన్.

అనుచు గద్దిరించునో పర్వతాగ్రణిదియు
మంచిమాటకు ఱాళ్ళెత్తి నొంచ నోర్చు
ఱాతిగుండెయెకాని మాఱాడకుండ
నూరుకొనునె మానవిభేదకోక్తుల విని

కాననసీమ నా పులిని గాంచిన నక్కయు మేన వాతలం
దా నిడికొన్నయట్లు మెయి దాలిచి మావలె మబ్బులార మీ
మానములాఱ నుశ్శో యని మారుతపంక్తియు దాల్చు ధాటికే
కోనలఁబట్టి పర్విడుటఁ గూడునె మద్గులఁ గూలి చావకన్.

అనుచు గహ్వరముఖముల నటులె మఱల
శిఖరపుంగేల తర్జించి చెప్పునేమొ
ధణధణమ్మన గుండె బ్రద్దలగునట్లు
తోనె ప్రతిగర్జ లిడు నేల నీ నగములు

కాని కొండెక్కి దివినాడు ఘనశకలముఁ
గాంచి మా కృష్ణభగవానుఁ డంచనడల
మహికి వేంచేయుఁ బింఛమ్ము మఱచి యనుచు
పురిని విప్పి తుఱ్ఱా నిడ నరయు నెమిలి.

ఎవనికై సింగిణి నవరత్నఖచిత సు
స్వాగతద్వారమై చదల మెఱయు
ఎవనికి దివిసాగు నేకాధిపత్యము
సూర్యచంద్రులు తేరిచూడలేరు
ఎవ్వాని కలయిక నెళమి భూదేవికి
పులకలై సస్యంపు మొలక లెదుగు
ఎండి నీర్ నీరని గుండె బగులు తటాకి
మెవ డప్పులిడ నింత యొగసియాడు

ధర కెవఁడు జీవనము లన్ని ధారవోసి
యంతరించునో సుకృతీ గతాయు వనఁగ

అట్టిఘనుఁడు ఘనాఖ్యతోఁ నలరఁజెట్లు
వానిపై నగ్రపీఠికఁ వైవదెట్లు?

పూలఁగలసిన తేనెయై పోవు నద్రి
జాలఁ జూచిన నశనియై రాలు నేల
పుష్పగర్భాసవమొ వజ్రపుంఖితమ్మొ
ఘనహృదయమర్మ మిది యనఁ గలరెవ రిల.



## శ్రీరాముఁడు

తలక్రిందు రామశబ్దము జపించుట నేమొ
　　తలక్రిందుఁ జేసె నితరకవులది
పండిన తలయంచొ పండొల్చి చేతిలోఁ
　　బెట్టు మాటల వ్రాసిపెట్టినాఁడు
ఎఱుకొటనో నాకె యెఱుకయంతయు నన
　　సర్వజ్ఞ రాము హస్తగతుఁ జేసె
పుట్టనుండుటొ వేఱె పుట్టనుండం డిట్టి
　　కవినాఁగ మ్రోగె నా కలపుగజ్జె

అవని నవకావ్యమగుటనొ నవరసములు
వలచి యేఱులై యా శ్లోకవార్ధిఁ గలసె
రాము కథ యాటనో తక్క రాజకథలు
రాము నీ సాటి యను భావరాజి వెలసె.

పుట్టఁ బెర్వఁగు నా శేషుని యట్టిదిట్ట
యనఁ బరంగు వాల్మీకి వ్రాయంగ వలయుఁ
గాని నే వ్రాయ ననె తానొ కలము మేమె
కల మనుచుఁ బల్కె మీ పాదకమలయుగళి.

అరయ రామనామ మమృత మెల్లరకును
ఇంత తియ్యఁదన మదెట్లు గలిగె
సాక్ష్య మిచ్చు పాయసాన్నమ్మ మత్కృత
పిండనామ మిల్లె యుండు ననుచు.

మహిఁ గవుల్ హరిమధ్యమా యని వర్ణింప
నెట్టి స్త్రీయు చూలు పొట్ట నింపి
కల్ల సేయు దాని గాని మా కౌసల్య
యట్టి పేరు కెపుడు కొట్టుఁదేదు.

బాలత్వమ్మున కుగ్గుపోయు తెఱుఁగమో పాల్గార్చు చా కల్కి నే
త్రాలో పట్టి యమాయకత్వమున కద్దా ట్లూప నా పాలదం
తాలో పశువిభేదము న్విడిచి సాదా వెన్నెలల్ గాయు పా
దాలో మానవనాటకమ్మునకు ముద్దౌ తప్పతాళా లిడున్.

నేఁడుగ బాల్య మింతకును నివ్విడనాడదు పాలబుగ్గ పొం
గాఱదు నూగుమీసములకా యెటు త్రోవయొ పుట్టలేదు నిం
డాఱుగ రెట్టయు న్మదుర దక్కట తండ్రికి బ్రాణగండమై
చేరెను కౌశికుం డపుడె చిచ్చుడికెన్ గనతల్లి ప్రేవులన్.

పుట్టెడు కౌసల్య పట్టియై హరియనం
బుట్టెఁడు ప్రేమమ్ము బుట్టె ప్రజకు
నారి లాగెనో లేదో నారి యా రాక్షసిఁ
దాటకం బట్టి వధ మ్మొనర్చె
ఆ సుబాహువులు చేవైన భారఁగలేద
హా! సుబాహువుఁ బట్టి హత మొనర్చె
కంటి కాచినయట్లు కనరాఁడు ప్రజకు ము
క్కంటి విల్లంటి ముక్కలు పొనర్చె
మీసములు వచ్చెనో లేదో మీ సము లిల
మెదరు శూరులు గలరన భువిఁ బరఁగె
తమ్ములట్టి కన్నులు తమ్మ తమ్ములట్లు
గాంచు నని యేమొ ప్రజ ప్రేమఁ గాంచ నలరె.

ఎవ్వాని కందమ్ము లేకపత్నీవ్రత
లోకమ్ము లేలు నేకైకలీల.
ఎవ్వాని శ్రీహస్తమే ప్రొద్దు త్రిభువన
ధర్మశిక్షణకు విద్యాగురుండు
ఎవని పాదము తండ్రి జవదాటి చనని వ
ర్తనమున కొక మార్గదర్శి యయ్యె
ఎవని నాలుక తా ననవరతంబును సత్య
వాణి పుట్టిల్లయి వరలు చుండె

అట్టి రామప్రభువరేణ్యుఁ డార్త జనుల
కంటినీట నిండియు నూర్పుగాలిఁ దూలి
వారి మొఱలను నుఱుముల వరలి యలుక
పేరి పిడుగుల గురిసెడి నీరదమ్ము.

నీపే ర్వీన భవాబ్ధి నీళ్లు మ్రింగు నదేల
జలధిబంధనఘట్టముల విని యెనో
ఇంద్రియదశకమ్ము నీవన తలవంచు
దశముఖవిధ్వంసదశ నెఱిఁగెనో
నీ పదమ్ములఁ గాంచ నెఱి ఱాతి గుండె యేఁ
గర్గు గౌతమసతి కథల వినెనో
పవనాత్మజు సమీపబంధువో యేమొ ని
న్ననినంతనె మనమ్ము కట్టువడును
పది యధర్మంపు తలలేని పాఁడి దప్పి
చనిన ధర్మంపు టాకతలన్ స్వమయవె యని
స్వాంతఁగా నాటకం బాడి జగతి కెఱుక
సేయఁగా రచించితివో యీ స్వీయచరిత.

ధరయుదరమ్ము బండిన ముదమ్మున ప్రాణ మొకెత్తు వెడ్డి పా
మరమున సాదుకొన్న బిడ యీ జనకక్షితినేతలక్ష్మి మా
దిరి మని కోసలేశు కిలుఁ దీర్చెడి కోడలు గేవలమ్ము నా
హారి వగు నీవు మెచ్చ నడయాడుచు నగ్గికి నంటరాని యా

దర చరితం గలంప శశి దార్కొనున ట్లొక మచ్చ వచ్చె నీ
చరితము లోని దేరికిని సమ్మతి కాదయ రామచంద్రుఁడా!

పెద్దమనిషివగుట ప్రేమతో నీదండ
దండ మగుచు నీదు దారి నడతు
నజ్ఞమహిషరూప మంది యా కాలుని
మోయఁజాల ముందు వేయు నేల?

అతఁడు గోబ్రాహ్మణత్రిదశాశ్రుసలిల
పూర్ణ నిశ్వసనానిలోదీర్ణ భీక
రాగ్ర హాళనిదీప్తదీనార్తనాద
ఘోరగర్జఝనమ్ము రఘుప్రవరుఁడె.



## హిందూమహమ్మదీయసఖ్యము

కలమా! నీ రెండు నాల్కలఁ గలిపి కమ్మ
నేకముఖముగా నడపించు చేమొ యనెదు
అల భరతభువిన్ హిందూమహమ్మదీయ
సోదరుల దొక్క కుత్తుక గా దగునసె.

తామయి గీయు గీటెపుడు దాటఁ డటంచు మతప్రబోధముల్
పామరతన్ రచించు ఋణపత్రములన్ దన యాస్తి వానికై
యేమి ఋణార్థమై కుదువ నిచ్చెనె దేవుఁడు తాతసొమ్ము నా
మామతమందుఁ దప్ప పరమాత్ముఁడు నొండెడఁ జిక్కఁ డందురే.

పరుని మిత్రుఁడం చొక్కఁడు ప్రాణ మిడును
తన్ను గొందు రిద్దఱు నొక తల్లి సుతులె
జాతిమతము రాగద్వేషసాధనములె
ఘనతమస్సత్వవివశచేతనులె గాక.

తమ మనఁగఁ జీఁకటియును సత్త్వ మన బలము
కానరాఁడు తమమ్మున తాను నొరుఁడు
సత్త్వమున దా నిలుచు మోయఁజాలు నొరుని
బాగది యొకొంకు సత్త్వతమోగుణముల.

నోరె పరాయి నే నోరువ నీతని
నను వేదము ఖురాను లనవుగాని
తలలోని మెదడె పెత్తల నేన యనుగాని
మా హిందుముస్లిముమతము లనవు
కను లిలయంత నా కను గాని శంకర
మహామదు లెప్పుడీ మాట లనరు
యెదయె నే పగతు నయ్యేద వీని కనుగాని
భాషలలోన నీ భావ మున్నె?

జుట్టు పరగళమ్ముల కొరిఁజుట్టు మనునె
బొట్టు లన్యుల రక్తంపు బొట్టు గనునె
లాఁగు నొరు లన్న ప్రాణము ల్లాగుమనునె
దాడి వేఱొక జాతి నాదాడి సనునె?

బాడబవహ్నియున్ జలధి బాయక యుండును యెండ నీడలున్
గూడి చరించు పృథ్విపయి క్రూరతరాశనిఁగూడి మేఘముల్
వేడుకతోఁ జరించు వినువీథుల నింతకు క్రోధవహ్నితో
మాడినమోర నీ వయితె మానవు మానవు డౌటవల్లనో!

కని గాలింతువు పరమత
మున్నఁ గల దొసగులను స్వమతమున లే వనియా?
కను నేత్ర మొసుల మలినము
తనలో నున్నట్టి పుసిన తాఁ గనఁగలదే!
పొత్తుగా నున్న నున్నమ్ము లెత్తె నేవఁడు
కొట్టుకొని వేటు బడ జుట్టుకొను న దేమి?
నుదుటఁ గేలవ యొకటిగా నదెన మసగు
నుంచ నొక కేలు నా పాపమంచు మసుకు.

ఆ మతాంతరుల రక్తాపగ నీదులే
భవవార్ధి దాటు నుపాయ మేమొ
జాతిబాహ్యులఁ జంపి శవములఁ బూడ్చుటే
జగదతీతసమాధిసౌఖ్య మేమొ
పరమతగ్రంథాళిఁ బచ్చిబూతులఁ దిట్టు
టతిరహస్యంపు మంత్రార్థ మేమొ
భాషేతరుల హ స్తపదఖండనమ్ములె
యింద్రియనిగ్రహకృత్య మేమొ
కటకట స్వమతాభిమానంపు కల్లుకైపె
అసలు తత్త్వమై తలకెక్క యన్యజాతి
మతహతికిని బ్రేరేపింప మధ్య నీదు
బుద్ధి బ్రద్దలౌ నౌట కపాలమోక్ష మేమొ.
హిందువుల నుండి ముస్లిము లెంతొ వేఱు
పరులు హిందువుల్ ముస్లిముప్రజల కనుట
వేఱు మానవవృక్షంపు వేరుపురుగు
పరు లనెడి పగ పరలోక మరుగఁజేయు.



# శ్రీకృష్ణదేవరాయలాంధ్రగ్రంథాలయము

కన్నడి నీ స్వభాష గలుఁగన్ దెనుఁగన్నను బ్రాణమిచ్చి నా
వన్న! యిదెన్ని నాళ్ల బుఱ మచ్చపు మాదు తెలుంగు బిడ్డలన్
గన్నడి కంచుకాగడలఁ గాల్చి నెమంకిన వీఁడొకండు నీ
వెన్నను దన్నువాడనుచుఁ బేర్కొనఁ జిక్కెనె కృష్ణరాణ్మణీ.

ప్రాణముంబోవ నిన్నెడఁబాయ ననుచు
బాసఁజేసితె మా తెన్గుబాసతోడ
నందులకె మేను వీడియు నాలయంబ
వగుచు నీనీడ సాకుచు నలరుచుందు.

చిన్నమాంబాదిసతులఁ ద్యజించి నీవు
విజయనగరసీమల నిండ్ల విడిచిపెట్టి
యచట గల భాగ్యభోగ్యము లడుగకుండ
మా తెలుఁగువాణి వెంబడి మరగినావె?

అరయ నరచేతఁ జెప్పిన ట్లాడె ననుచు
తలఁప నోటిలో నాల్కయై తనరె ననుచు
దాటియెఱుఁగదు నా గీయు గీటు ననుచు
వాణి గూడితె? సుఖపడవలె నటంచు.

మనుచరిత్రమ్ముతో మను చరిత్రము నాది
    యాచంద్రతారార్క మని తెలిసితో
పెద్దనకవితోనె పెద్దనఁబడుదు నే
    నిల నంచు పలుమారు దలఁచినావో
కృతుల నందుటతోనె కృతినాదు నే నని
    బహుళాంధ్రకృతులను బడసినావో
తెలుఁగువాక్సతియె తం తెలుగూర్చు స్వర్గమ్ము
    నకు నా కనుచు నర్చనల సలిపితో

ఆంధ్రకవితాపితామహుం డాదిగల్గు
నష్టదిగ్గజంబులతోనె యష్టదిశలు
వెలుఁగు నా కీర్తి యంచు భావించినావొ
త్రిదివగతకాయ! శ్రీకృష్ణదేవరాయ!

చదువ నేనుఁగునెక్క సంతోష ముదయించు
    నన నేన్గునెక్కించి యలరఁజేసి
ఆలకించనె శిరం బాందోళన మొనర్చు
    ననఁగ నాందోళిక నునిచి మోసి
అన్నిభాషలకంటె నగ్రిమగతి మనో
    హారియౌ నన నగ్రహారము లిడి
నాకుఁజూడఁగ నీమె నడయాడు పదముల
    గల సువర్ణాళిని గాంచి నంత

చెలగి నవత్నములు బ్రకాశించు నటులు
నవరసాల్ చవులూరు ననవరతమ్ము
నాగ నవరత్నఖచితస్వర్ణవలయంబు
నునిచితె పదమ్మునన్ మాదు తెనుఁగుసతికి.

నన్నయ్యరూపొంది నన్నయా! పూజల
నొనరింపు మనెనొ మా తెనుఁగువాణి
తిక్కనవై కైత దిక్కనంబడు దేన
ననుగాంచు మనెనొ మా తెనుఁగువాణి
పోతనవై యమృతపుంబోత నన నే న
నుచుఁ బల్కు మాదు తెనుంగువాణి
పెద్దనవై నేనె పెద్దన నన్నింట
నని తెల్పు మాదగు నాంధ్రవాణి
అష్టదిక్కుల తనకీర్తి నలమ జేయ
నెలమి నానావతారము లెత్తి తేనె
తేటఁగురిపించు మాదగు తెనుఁగువాణి
దాని విడి కృష్ణమధుప మే దారిఁజనును?

గాత్ర మెప్డేని గాఁగలదు నాశంబని
పత్రరూపామ ర్త్యపదవిఁగాంచి
శబ్దంబు మేనితో సమసిపోవు నటంచు
నక్షరరూపాళి నమర నిల్పి
ఎడదతోడుత భావ మెగసిపోవునటంచు
పదబంధమున వాని బాదుగొల్పి
కృష్ణరూప మ్మెన్నఁడేని మాయునటంచు
వర్ణాకృతులను శాశ్వతమొనర్చి

తాలిచి త్యజించు దండనాండాళు తాను
రంగనాధుని కిడిన తెలుంగు నీవు
తనువుఁ దాలిచి విడిచి మా తెనుఁగుసతికి
నిడితి వాముక్తమాల్యదాయిత మొనర్చి.

పుండరీకముమధ్య కొలువుండు వాణి
పైడిగద్దియ విడిచి యెయ్యెడకుఁబోయె
తేట తెనుగుపల్కులను సాపాటుసేయ
తెనుగుబిడ్డ నాలుకపైకిఁ జనినదేమొ?

బాల చంద్రాకృతి గ్రాలెడి యరసున్న
పూర్ణచంద్రాకృతిఁ బోలుచున్న
నక్షరాక్షరమున నమరి యుండుట నమృ
తాబ్ధియయ్యె నస్మదాంధ్రభాష.

దేశభాషలందు తెనుఁగు లెస్సయనుచుఁ
బలుకవలసినంత ప్రతిభ యేమి
కొలిచెను ముమ్మారు గురులింగ మూర్తియే
హద్దుఁ జాళులగుచు నామె రూపు.

హరుడు తానో యెవరియందలి గుణములేన్
దాచకుండఁ జెప్పు ధర్మరాజు
తొల్లి సురలు ద్రచ్చుతోయధి శశి దేల
బాలుఁడనక శిరసు పై నిడ్డఁడె?



# రామాబాయమ్మ స్మృతి

[ఈయమ నాజన్మస్థానమగు మడికొండలో జన్మించినది. వైష్ణవసంప్రదాయ నియోగకుటుంబమునకు జెందినది. చిన్ననాటనుండి నన్నును నాముగ్గురి సోదరులను సాది చదువులు నేర్పికొన జేసిన సదయహృదయ. ఈమె మాకొనర్చిన యుపకారమునకు కృతజ్ఞతగా మరణానంతర మాత్మశాంతికై వ్రాసిన పద్యాలివి. ఈమె భగవద్భక్తురాలు. మార్గళి యను వైష్ణవవ్రతమును జీవితకాలమంతయు ప్రతిసంవత్సరము సంక్రాంతినెలలో నొనర్చెడిది.]

మణిగిరిని గల మానినీమణులలోన
ప్రజలకెల్ల నాపత్కాలబంధువైన
తల్లి రామమ్మ చనుట సంతాపకరమె
గాని మృత్యు వెవ్వారినేనిఁ గాచఁగలదె.

ఉగ్గుబోసి పెంచి యోనమాలాదిగ
దిద్దబెట్టి యింత పెద్దఁజేసి
యింటనుంచి పెంచు చెంతో సంతోషించు
తల్లిఁగూర్చి చెప్పఁదలఁతు కొంత

కలిని వేంకటనాయకుం డిలను బ్రోవ
తిరుమలను జేరె నీ కడ దివ్యమైన
వానమామల న్నివసించి వరలినాఁడు
వేంకటార్యుఁడై యున్నచో శంకయేమి ?

నిండుఘటంబు మాని కడునిగ్రహజీవి యఖండధీవిశా
లుండయి నీఱుగప్పికొన లోపల నుండెడి నిప్పు బోధనన్
బండును దొల్చి రత్నమన భాసిలఁ జేసెడి వేంకటార్యుఁడై
యుండె ప్రబోధకుండుగ నహో ! యిఁకే నేమిట నీకుఁ దక్కువో?

ఎచ్చటనేని నీవు పరమేశకథ ల్వినిపించుచుండ మే
మచ్చటి కేగుదెంచఁ గని యయ్యొ ! క్షమింపుఁడు చెప్పుచుంటి నే
వచ్చియురాని మాటలని వాకొనుచుంటివిగాదె పృథ్విపై
వచ్చియురాని యా జనకువంటి యలిప్తుల మాట లేమొకో?

భాగవతమ్ము నీకు ముఖపాఠమె యందలి కృష్ణలీలలో
సాగుచు నీదు కందొవల సంతత మా యమునా స్రవంతులన్
దోఁగఁగ జేయు నాత్మమలదోషనిరాసక మ్మౌచు నౌర యా
భాగవతాంతరంగమె కృపామతి కృష్ణుని నందభూమియో !

మానవా ! దుర్గుణము లెల్ల మాన్ప వనిన
మానమెప్పుడు మమతాభిమాన మనుచు
అందులకె యీ నిరభిమానమైన శుద్ధ
వైష్ణవమతంబునం బుట్టి వరలినావె !

ఆ గజేంద్రుఁడు మోక్షమందిన కథఁబాడి
యా గజేంద్రుని నెక్కినంత పొంగు
ప్రహ్లాదుఁ డొందు పెన్బాధఁ దప్పుట విని
ప్రహ్లాద మొందుచు పకపక నగు
బలి వామనునకు భూభాగమిచ్చుటఁ గాంచి
బలి మెక్కు విహగేంద్రు పగిది నెగురు
గొల్లకన్నెలు కృష్ణుఁ గోరి యేడ్చుట తన
న్గొల్లకొట్టినయట్లు గుండి యేడ్చు
భాగవత కథాసారానుభవము నందు
నట్టె లీనమై భాగవతాకృతిగనె
మాఱుచుండును సర్వమ్ము మరచిపోయి
యిలను భక్తులు పిచ్చివారలు తలంప.

మధుసూదనుని జేరు మార్గమ్ములకు మేటి
శిర మనఁబడు మార్గశిరమువందు
అజ్ఞాననిద్ర మా కతిశీఘ్రమ్మే వీడు
నన దినము ప్రదోషముననె లేచి
వడక దీ సంసారఘోరాశిఁ గని మా మె
డద యునఁ జలికేనిఁ బెదరకుండ
దోషము లిన్నిత్యంబు దుడిచివేయుదు మిట్లె
యన నిండ్ల వాకిండ్ల నలికి స్నాన

మూడి కృష్ణానుభవమున నలరు నట్టి
మానసమలద్దైన గోపికామానసదీక్ష
ముప్పదేడు లోనర్చు మా ముసలితల్లి
ముప్పదెట్లు దప్పదు జన్మములు నశింప.

శ్రుతిగతంపు ధర్మము తమ శ్రుతికి సతుక
చెవియెపో ముక్తి తాళంపు చెవి యగునని
తెలిసితివో యేమొ నిన్ను నీ కలికిఁ బాపి
శ్రావణమ్మె ముక్తి నొసంగఁ జూతె నౌర!

మనమా! యిఁక ఛంచల్ల గతి
మనమా వ్యాకులమ్ము గాంతు మనుకొనుటలు కా
మన మాని రాముఁ గొల్చిన
మనమా పరమపద మందు మన మని చనితో!

రామమ్మా! నీ వెంచిన
రామన్నను జూడనైన రావమ్మ దయన్
రామన్న చోటి కేగితె
రామన్నయు మేము నల్వురము నే మగుటల్.

అమృతమనుచును మనసిచ్చి యాదరించి
వినుచు నుంటివి నాదు కవిత్వమెల్ల
దాని వినియేని యాత్మశాంతమ్ము నీకు
గలుగఁ గలదంచు భావించి పలికినాఁడ.

# కుసుమోపదేశము

పుష్పమా! నీదు చరితమ్ము పూర్ణమగును
ఒక్కరెన్నాళ్లలో నేమి దక్కె నీకు?
మంచివాసనల నెడంద ముంచికొనియు
చిత్రవర్ణాల పోషాకుఁ జేసికొనియు
కడుపునిండారఁ దేనెపాల్గుడుచుచుండి
తీఁగె టుయ్యాల స్వాదముతో నూఁగుచుంటి
వగ్రిమస్థానమున క్షణ మ్మాత్రగవైతి
కూర్చు తేనెను తుమ్మెదల్ గుడిచిపోయె
అందమెల్లను మట్టిలో నడఁగిపోయె
కోమలత నెల్ల యెండలు కుములఁజేసె
ఆ సువాసన న్వాయువు లపహరించె
నొక్కరెన్నాళ్లలో నేమి దక్కె నీకు?
రాలిపడి మాతృభూపూజఁ దేలుమనుచు
ఉన్నరెన్నాళ్లె నవ్వుచు నుండుమనుచు
యునికి కగ్రిమస్థానమే యొప్పుననుచు
వని సువాసనవలె కీర్తి వైభవములు
వ్యాప్తి గావింపుమనుచు యీ వసుధపైని
విత్తమునియొ మధూకర వృత్తి సేయు
బీదలకె తేనెవలె పంచివేయు మనుచు
యిట్టి లోకసేవారతు కెవని కేని
పెత్తనము దేవతల తల స్వైర మిడదె
అందమున సుందరుల తలక్రిందుఁగాదె!

# గేయములు

మా యంతరంగాల మాధురిమ సొంపు
మా మొదల నుదయించు మంచివాసన పెంపు
మీ మనమ్ములఁగలదె యో మానవుల్లార
అనుచు మము పరిహాస మాడుగతి నిత్యమ్ము
నవ్వెదువె యో చిన్ని పువ్వుకోమలిరో!
మావలెనె మీరు తలమానికా లగుదురే
మా తీరు ముక్కుముత్యా లగుదురే మీరు
మా దండలకు గళము మరలుకొన దెట్లు
అత్యంతప్రేమతో నలముకొన దెట్లు
అనుచు మము ప్రతిదిన మ్మపహసించెడి నసఁగ
నవ్వెదె యీరీతి పువ్వుకోమలిరో !

---

# కొత్తకొండ వీరభద్రుడు

## ౧

[నైజాంలో హుజూరాబాద్ తాలూకాలో చేరిన యొక గ్రామము. ఇచ్చట ఒక శైవసంబంధమగు జాతర జరుగును. ఇచ్చటిదేవుడు వీరభద్రస్వామి. ఇచ్చట మకరసంక్రమణమురోజు గొప్పజాతర జరుగును. సుమారు రెండురోజులలో ౧౨ వేల రూప్యములు దేవునికి ఆదాయము వచ్చును. అనేక వేలమంది భక్తులు బండ్లుగట్టుకొని బండ్లపైన యేనుగులు గుఱ్ఱములు పక్షులు మొదలగు కృత్రిమప్రతిమల గూర్చుకొని వచ్చి దేవునిచుట్టు దిరిగి సేవించి గుమ్మడికాయలు బియ్యము కోరమీసములు నిచ్చి కోడెల స్తంభములకు గట్టి మ్రొక్కుబడులు చెల్లింతురు. స్త్రీలు సంతుకొఱకు తడి బట్టలతో వడకుచు వచ్చిగుడియొద్ద బట్టుకొని నిల్చి వరములు వేడుచుందురు. ఇచటి పంజ కమేటీ మెంబర్లలోని సర్పంజ్ మ॥ రా॥ శ్రీ గుండవరం జగ్గారావు గారు.]

వరద! యిది శివక్షేత్ర మే నె వ్వైష్ణవుఁడను
నుడువుటెట్లని యనుమానపడితి వేమొ
ఆ మతత్రయా లొకచెట్టు నాటు గొమ్మ
లనుచు నీ శిఖరాగ్రము నధివసించు
ఘనత్రిశూలమ్మె నీ తిలకముగ నలరు
ఏటికీ సంశయము హరి యెచట లేడు?

కొండలు దేవళ్ళా ల్గలవు కోట్లుగ నన్నిటికంటెఁ గ్రొత్తయై
యుండుటఁ గ్రొత్తకొండ యగునో యని వచ్చితినార! యున్కికే
కొండయు లేదిదేమి యనుకొంటిని, గాదటు భక్తసంతతుల్
కొండని యిచ్చు నాముడుపు క్రొత్తలె కొండగఁగూలె తేటగాన్.

క్రూరశిక్షణార్థంబయి వీరతయును
భక్తరక్షణార్థంబయి భద్రతయును
కరఁగిపోసిన యవతారపురుషు డంచుఁ
బ్రజ యెఱుంగుటకై వీరభద్రుఁడై తో?

వీరభద్రుఁడై దక్షుతోఁ బోరి శిరముఁ
ద్రుంచి మేఁక శీర్ష మ్మతికించువేల
వీటి తలఁబెట్టుకొని చూడ వెల్లడియగు
వేల్పుయందు మేషముఁ బొందు వెత లనియొకో.

అది గ్రహించియు గొల్ల లహాహా యటంచును
కడముట్టె మాదగు నిడుము లనుచు
గొఱ్ఱె మేఁకలు వృద్ధిఁ గానె నీశుకృప నంచు
దక్షప్రభుని చెఱల్ దప్పెననుచు
నిను శిరమ్మునఁ బూన్చుకొని బాహ్యలోకమ్ము
మేనితోఁపాటు నెంతేని మఱచి
యీరబద్దిరసామి నేనంచు నైక్యమై
చిందులు ద్రొక్కుచు శివముదూల
వట్టి కల్లలంచును నను వంటి పర్జలు
కీలుదెలియక వారిని గేలుసేసి
నంత నేమగుఁ వారిదా నంతరంగ
మీావెఱుంగవె మాయల నెఱుఁగ దనుచు.

తిలకింపుడీ జగత్తుల బూదిగా నంచు
తిలకముల్ గా బూది దిద్దువారు
నవధాన్యమాత యీ నందీశుపదజాత
యని నంది బియ్యమ్ము నునుచువారు

మున్గినారు భవసముద్రాన వీరేశు
　　　శరణొందఁ దరిఁ జేర్చు సర్వజనుల
ననుచుఁ జెప్పఁగ నేమొ స్త్రీ జనము తాము
ఉరక జలముల మున్గి సుందరతరమగు
నీదు గుడియొద్దు చేనంటి నిల్చియుండి
వడఁకుచుం గానఁబడుదు రెప్పుడునుగూడ.

ఇమ్మహీ తీవెలు న్మ్బరువు నెత్తఁగలేనటు వెంపుఁజెంది యొ
క్కుమ్మడి గాఁగ నీకడనె గూలెడి గుమ్మడికాయ లవ్విరో
ముమ్మరి జన్మజన్మముల మోసెడి కర్మఫలంపుభారమో
యమ్మరో! మోయలేరు హరు కర్పణ సేయుట మాకుఁదెల్పునో.

ఆఁకొను యజ్ఞవహ్నులనె హాయని కాలుచుఁగూలు చేలతా
మేఁకలు గొఱ్ఱె లూరకను మే! యని యెల్లర తల్లివైన నిన్
గేకలఁ బిల్చె నేమొ పతికిన్కగణింపఁగ వచ్చిచూచి యా
నీ కమనీయదేహమును నిప్పులఁ గూల్చెతె వాని యార్తి వోన్.

దక్షులౌ దొరల్ గోమేధతతుల మమ్ము
బొలియఁజేయ యూపస్తంభములకుఁ గట్టె
వైతు రని గోగణమ్ములు వచ్చి భీతి
గావు మని ధ్వజస్తంభానఁ గట్టువడునొ?

స్త్రీ బాలవృద్ధుల చేత గాడని కొండ
　　　దిగి క్రింద దర్బారు దీర్చినావొ
వీరత న్గని ప్రజల్ వెఱపుఁగొందు రటంచు
　　　నాటబొమ్మగ మారి యలరినావొ
నాసుతుల్ శ్రమఁబడి నడుచు చేటికటంచు
　　　బండ్లతో నిటు బిల్వఁబంచుకొనెదొ
నందీశ్వరుఁడు లేమి నాప్రపంచము సాగ
　　　దని కోడెలను గోరుకొనెద వేమొ

నీదు పదభక్తియుక్తులై నెగడువారి, వీరభద్రాత్మకు లటంచు వెల్లడింతు
అరయ నీపదభక్తి లే నట్టివారి, వీరభద్రాత్మకు లటంచు వెల్లడింతు.

బండ్లపై నున్న కృత్రిమ ప్రతిమలైన
కరి రథాశ్వప్రభులు నిన్ను గాంచి వేడ్క-
మఱల నిండ్లకేగగ మోర మూఁడ్చిన వన
దుమ్ము తలఁగొట్టికొని చను సమ్మతిలక.
కోరఁ బెకలించి నిధిఁదీసి కూర్తుఁ బ్రజకు
కోఱఁ బెకలించి వధఁజేతుఁ గ్రూరదతుల
నమచు వీరత న్భద్రత న్గొనుచు దివ్వి
కోఱమీసల రెంటిని దీరిచితివా.

గంగాభంగతరంగహస్తములు రాకాచంద్రసత్పాత్రతోఁ
బొంగుల్ వారెడి యుగ్గుబాల సుధలన్ బోయన్ మహాభక్తి యొ
ల్కంగ న్వాంగి సలాము లా పడగ కేలన్ సేయు నాగన్న నీ
కుం గారాబపుఁ దొల్లెలై తలపయిన్ గూర్కొందు నట్లూపఁగా
బంగారమ్మటు బెంచె నా జటనె యబ్బా! నిన్ను చేఁజేత కొ
ట్టెం గాదే హరు డీడ్చి ప్రేమయశె యీశెన్ బూను నా భిల్లుకున్.



## కొత్తకొండ వీరభద్రస్వామి

నాకలము మీదు పూజల
నాకలమై పత్రి సుసుమనోర్పణ సేయున్
వీకన్ వచ్చియు రాని వె
వాకుల బ్రహ్మాణ్య శిశువు వశజేయుగతిన్
రెన్నాళ్లె నీదు జతరా
యెన్నిదినాలున్న నేమి యెసక మెసఁగెనాన్
రెన్నాళ్లె నీదు జతరా
యెన్నిదినా ల్దంపతులుగ నెసఁగెద రనెదో

వీరన్నా ! భవదీయదర్శనముకై వేమారు యాచించినన్
జేరన్దీయవు దర్శన మ్మిడవు ని న్సేవించగా వచ్చి నీ
ద్వారంబంటి వసించు భక్తతతినే దర్శించగాఁ జేతువా
వీరన్నా ! నిజమా మదీయ తనువై విచ్చేసినా రందువో?

బాల చందప్ప జంపాల లూపుచును బై
శయనింపఁజేసె నీ జటయెకాదె.
కడుపు చల్లని తల్లి గంగాభవానిలో
నీఁదాడె నాచుగా నీ సుజటయె
శీతనగమ్ముకై చిత్రంపుఁ బవడాల
పేరుఁగ్రుచ్చి యిడె నీ చారుజటయె
మినుసిగక్ జుట్టిడి మిడినాగు గున్నకు
వల్మీకమయ్యె భవత్సుజటయె
పూని లోకోపకారమై బుట్టు నీదు
రాగయుతజటం గోప మెచ్చో గలుగును
దక్షుపై గోపమగ్నియై తరిమి రాఁగ
మంట తల కెక్కె నయ్య యుమాసనాథ!
ఎంతఁగల్గిన వీని కెపుడు బిచ్చపుటాస
విడదంచు నరుపుత్తె బిచ్చమెత్తు
పాములవలె నగల్ బాధించినను వాని
నే గోరునని నగన్ భోగి సేసె
కైలాసభవనముల్ గట్టిన నెప్డుచిం
తన్ కాలు నన చితాస్థలి వసించె
వెండికొండగఁ జేసివీనిఁ గూర్చుండఁ జే
య నట దారిద్ర్యమే యభినయించు
అని నరుని దుర్గుణాదర్శమును ధరించె
గాని ముల్లోకపతికి శ్రీకంఠు కేమి
లోపమని యుండు నట్టి యుమాపతికిని
జుట్టులోఁబుట్టు వీరేశు నెట్టు లనుట.
శమనహస్తాగ్రపాశమును నీ యసి జిహ్వా
పాలపాశమ్మట్లు గ్రోలి వైవ
యమునిదౌ వాహన మనిన నీదు త్రిశూల
మా ముల్లుగట్టయె యవల గెదుమ

మి త్తికోటులను నీమేటి మోసపు కోటి
నల్లద్రాచు కోటులమై నలిపివైవ
భవపిశాచమును నీ భయదమౌ డమరుక
మ్మదలించి జడిపించి యవలి కంప
నన్నివిధముల న్నీవును నచ్చుగుద్ది
నట్లు మాయయ్య మృత్యుంజయత్వమందు
మఱువఁజేసితి వౌర నీ మహిమ యేడ
కలితకరపాశ! వీరేశ! కలి వినాశ!



## హరిజనుఁడు :: మాలపల్లె

బ్రాహ్మణుని వద్ది కరుగఁగాఁ బజ్జకేని
రాకు మను; బ్రభుతొత్రమ్ము రాత్రిఁ బవలు
వెట్టి కైంకర్యముల నల్పి పెట్టు; వైశ్యుఁ
ద్రాసు పయిన మాలిడి నాల్గుకాసు లిగ్గు!
అరయ శూద్రుఁడీ మువ్వుర ననుసరించు
నంత్యజున కెవ్వఁ డిల దిక్కు హరియె కాక!
హరికి పట్టిన జనుఁడౌటా హరిజనుండు!

అచటి గుడిసెల యెదల కీ హరిజనగతిఁ
గనఁగ నే మనిపించునో గాని వాన
బడనె వానిపై కన్నీటివరదఁ గార్చు
నుడుకు టెండన్ దహించు నిట్టూర్పు విడుచు
గాడుపుదుమారముల వీరిఁగాంచి నెఱిగ
నాగఁజాలకఁ బయిపయి నరుగు నెటకొ!

ఔర! పరదారసంస్పర్శ నఘమె లేదు
పాపమే లేదు నన్యధనాపహృతికి
భారతాంబకుఁ గడఁగొట్టు పట్టియగుటో
యకట! కడఁగొట్టుఁ బడియె నీ హరిజనుండె.

వీరి యస్థులు తమ నూరుకండలఁ ద్రవ్వి
యేఁకటి కే రాజు కన్నమిడెనొ
వీరి నిట్టూర్పులు విసరె నా సౌఖ్యాంబు
దముల నే మారాజు తలనొ గురియ
వీరి చెమ్మట నీళ్లు విడిచె నా శుచికి నే
దొడ్డయ్య లోఁగొంది తుష్టిఁజెంద
పొరలఁ నశ్రులధార వోసిరా యుండ్ల సొం
పేరాజు మేడలో నెక్కియాడ

వీరి స్వేచ్ఛావిశాలాక్షి చారుదృష్టి
కొకట నే యుక్కుదార కేల నుఱుకులాడు
విచ్చుతరవారి మెఱపుల కుచ్చెళు లవి
కనఁబడెనొ కాని చిట్లు చీఁకట్లు క్రమ్మె !

దొరల తెల్లగుడ్డ లవెంతొ దూర ముండఁ
గనె యడవిజంతువులవోలెఁ గాంచి బెదరి
బానిసను దండ మని పుత్తెఁ బాదుకొనుచు
వంగి యెపుడొ చచ్చినటు తొలంగి చనరె !

వీరియూహాతరంగాల దారి కెంత
దూరమో చెలియలికట్టపొర్ల మెపుడు
ముట్ట విచటి యాశాలతాముఖములందు
పూలుపూసి ఫలించక రాలు నెన్నొ !

ఎండల నెత్తిజీమలయి యేడ్చుచు దిక్కురుపక్షు లాచు మే
ల్పొండుచలి న్వడంకుచును పుట్టెఁడు కష్టముఁ జేసి పోయుచున్
దొండపుదొడ్డుధారలుగ దొల్లెడి వానలు పిడ్గులు న్పడన్
బండయటోర్చు చెక్కడివి పాపపు జన్మలకా! సుఖా లనున్.

రంగులు వేయకన్మెరుఁగు రాచని పైడి పతానిబొమ్మ లీ
యంగన లంగలారు కననగ్గికి నంటఁగ రాని పేదసీ
తాంగన లా యరుంధతులు నారయ వీరిని లేరదిట్లు ఛీ
యెంగిలివయ్యె నీ బ్రదుకు లేరికి మెప్పగు నెట్లు లుండియున్.

దినమంత రెక్కయాడనె బుక్కయాడెడి
వట్టి రిక్తుని చెయిఁబట్టియేని
కలినో యంబలినో పూఁటలఁ ద్రోసిపుచ్చెడి
ఘోరదరిద్రముతోఁ గూడి యేని
అకట యింటికి నింత యడిగికొనుచుఁ బొట్ట
బోసికొ న్భిక్షుకుఁ బొంది యేని
యాపూఁట కొక యింత యన్నకణంబేని
గతిలేని వానితోఁ గలసియేని

యెపుడు నవ్వులు నవ్వుచు నెంతొ ముద్దు
గాను కళకళలాడుచు మొగాల నిచటఁ
బొద్దుఁబుచ్చెద రెందఱో పుణ్యసతులు
ఏమి జూచుకొనిరొ యది యెవరి కెఱుక?

అచటి కాణాచి యిటులు పెద్దమ్మ తానొ
యొడువని మిరాశిగా దాని గుడుచుచుండె
దీనతాజనయిత్రి యి ద్దీని నామె
కాఁపుబిడ్డ కట్నమ్మని యోడి నింపె.

చంక జోలెల నెక్కి జంపాల లూఁగుచు
తిరువీధు లూరేఁగి తిరిగి వచ్చు
యా గుడ్డచింపుల యద్దాలలోనుండి
తెఱచాటు బొమ్మయై తేరిచూచు
నిత్యుపవాసాల నెఱపు చేకాదశి
పండువుల్ సేయును బ్రతిదినమును
కాలమ్ము చక్కఁగా గడవని యప్పు డెల్ల
ఋణపత్రికావ్యమ్ములను రచించు

నస్థిపంజరశుకమయి యఱచు నొకట
ముష్టిసామ్రాజ్యమహిషియై మురియు నొకట
గోచిపాతరాయని నెత్తిఁ గొట్టు నొకట
యునుపగజ్జెల తల్లి దింటింట లొల్లి

ధనమె తను గన్న బిడ్డల రక్షణము సేయ
సాధకమె దరిద్రము వీరిఁ జంపుకొనునె
పెట్టుపోతల నిరుపుర భేదమున్న
కడుపుతీపెవరికైన నొక్కటియె కాదె!

పొంచి మృతపశుమాంసముల్ పొడిచి తినఁగ
నచట పైదిర్గు కాకగృధ్రాకృతు లవి
యేమి తెలియని వీరల నేపరించు
కొని తినెడి యగ్రజాతుల మనసు లేమొ?

అచటి చచ్చుతోళ్లెముకలు నడచి కొఱుక
గ్రామసింహాల బెదరింపు గరుగురు లవి
వీరితోళ్ల నెమ్ములఁబట్టి వెట్టిఁగొట్టు
గ్రామకరణాల భయదగర్జాప్రతులొకొ.

నేఁడు తల నీవు దాల్చు పానీయఘటము
గడచిన దినాలఁ గుమ్మరి కాలిధూళి
శిల్పి మలిచిన వేల్పుతా శిలలెకాని
పతనగతి నింటితొ్రక్కుడుబండ లయ్యె.

దృష్టిపాత దూరమున నే దెసను గనిన
ముగిసినట్లుండు చని కన ముందువలెనె
యెడ మగును పాంథునడయె ముందడుగుఁ గాని
యాశ కాశాంతరాళమ ట్లవధి గలదె?

ఆ పరమాత్మ మానసము నంటు జగద్ధితభావసింధు వం
దోపికఁ దేలియాడు నడయూరుపు శీతలమందమారుత
మ్మా పరవాసుదేవనయనాబ్జ మిలాపరితాప మార్పఁగా
నోపిన ఖేదబాష్పములె యున్న సజీవనదీనదాంబువుల్

ఆ పురుషోత్తమాయతకరాంగుళు లీప్రజ నేచు నాఁకలిన్
బాపఁగ బాలబువ్వఁగొని వచ్చిన వీతరుసస్యజాలమై
శ్రీపతి యేకులమ్మనక చిన్నయుఁ బెద్దనకన్ దయాళువై
దాపుకుఁ దీసి తా నిడఁడె తాకఁగ రాకని చేయిఁదాచెనే!

20

ముట్టిన వ్రేళు లచ్చుటికి ముర్గిపడంగల వేమొ యింతయుం
బట్టి స్పృశింప వెంటఁబడి పాపపరంపర లాక్రమించు నె
ప్పట్టున నీడఁ బారినను బారి సచేలముగాఁగ స్నానముం
బట్టియు పేడ రాచుకొని మాపును రేపును జేతు రెవ్వరే

హరిజనుల నుద్ధరింపఁగా నవతరించె
తొల్లి రామానుజుఁడు దేవదూతవోలె
అట్టి కార్యదీక్షకయి మహాత్ము డిపుడు
మరల నడుముగట్టెను వారి మనుచుటకయి.



# చుట్టఁ గాల్పు

పయిన బూడిది సేయు పట్టుదలయె కాని
చవియుండునే జుట్టఁ జప్పరింప
ఆరోగ్యమునకు నిప్పంటించుకొనుటెపో
సిగరెట్టు గాల్చుట చిన్నపనియె
శ్వాసకాసామయ శక్తులన్ ధూమాళి
నాహ్వాన మిడుట పొగాకుఁ బీల్చ
నోటి దుర్గంధమున్ సాటించు కొనుటెగా
తెగద్రావి ముక్కుతో పొగవిడుచుట

దొండపండుఁ బోల్పెదవుల నుండనీక
కాకిముక్కుతోఁ గమ్మరి కారుమొనల
తోడ వియ్యంబు లందుచు వీడరాని
చుట్టజికముఁ గల్పించుటె చుట్టఁబీల్చ.



# ధనురారోపణము

ఎవ్వఁ డీ మహాదేవు విల్లెత్తఁ గలఁడో
వాఁడె జనకజామాతయై వరలఁగలఁడు
ఎవఁడు తా నెక్కిడఁగలేఁడో శివధనస్సు
'జనకజా! మాత' యని యనఁజను నతండు.

రామ చంద్రవదన రామచంద్రు నెడద
మెచ్చు నాపె కీడువచ్చు నతఁడె
యంచు నాత్మ నింత నరయక నాబాల
వృద్ధ నృపతిగణము వెడలి రటకు.

తెలిసిపోవును మీసముల నీలిరంగంచు
వడివెట్టఁ గేలెత్తి యడుగువారు
బయటంబడును కట్టుపల్లువరుస లటంచు
నగఁ బోయి నోర్మూసి నెగడువారు
తెలిసిపోవును జానువుల పట్లటం చట్టె
లేచి సోఫాల గూలి పడువారు
తనువు లేపిన యంత ధనువుగాఁ గన్పడు
నని మూలవిగ్రహాలైనవారు
సీతకై రాఁగ ధనువు దృష్టిఁబడి మాడు
తనువె చెమటలు గ్రమ్మ శీతమయ మయ్యె
నున్నసతి ముండమోపు నీ యువిద ప్రాపుఁ
గోరరాదను ముది పెండ్లికొడుకు లాకట.

పైమెరుంగులె లోనిబలము సున్నని యేమొ
జల్తారుపైఁ జూప సద్దువారు
వెలపైడి కేమేమొ యలతుల మనియేమొ
భూషణాల్ పయిఁజూపఁ బుడుకువారు

వస్త్రము లేగాని యస్త్రమ్ములను మోయ
నోపమంచు పొషాకుఁ జూపువారు
ధను వెత్తలేని యీ దద్దన్నలకు మీస
లా యని యోవడిన్ లాగువారు
తల్లి చెల్లె వరుసయంచుఁ దలకువారు
గోత్ర మొకటయ్యె నెట్లని గొణుగువారు
అకట! రాశి కూటా ల్దోరయ వనువారు
లేవ లే కేవో మిషల వాపోవువారు.

విల్లెత్తె నా రఘువీరుఁడు కౌశికు
తనువున పులకలు తాము నెత్త
భూపాల శిరములతోఁ బాటు ధనువును
వంచెను జానకీవల్లభుండు
జనకు సంశయముఁ దోడ్కొని నారి మును వెక్క-
లాడించె పఙ్క్తిరథాత్మజుండు
నారితో పాటు నా నారీలలామయా
వై దేహి మది తన వంక కీడ్చె
అరయ నీ రేడు లోకమ్ము లందుఁగూడ
నెదు రెవం డింక నాకని యెగసి యాడు
భార్గవుని దుర్మదమ్ముతోఁ బాటు ధనువు
విఱిచి వైచెను శ్రీరఘువీరుఁ డపుడు.

# కవిత

ఉత్తమకవితాలేఖన, చిత్తమ్మెల్లరకు నురకచిక్కునె కూర్పఁగ
విత్తమ్మా నేరిచికొన? ప్రాప్తమ్మా పూర్వజన్మపుణ్యమె కాకఁ.

రంగులపేటి లేక సుకరంబగు మాటలచే తలిర్చిన
ట్లుం గనిపట్టు జీవకళలో కడు లెన్నగనుంచు కాగితం
బుం గొనకుండ నా ప్రణయమూర్తి నెడందన నచ్చునెత్తుక
న్నుంగవలేనివారును కనుంగొను చిత్రము కైతయేకదా.

నాల్కనాననియట్లు నవరసాల్ చవిజూపు
    పాకమ్మొనర్చు ప్రభావిభాసి
నేత్రమక్కరలేక నిఖిల నాటకరంగ
    పాత్రల జూపించు సూత్రధారి
పాద మక్కరలేక ప్రత్యక్షువిశ్వసం
    చారమ్ము సేయించు గారడీడు
మృతునైన తిరిగి జీవితు నొనర్చి జగాన
    తిరముగా నిల్పు సంజీవిపుడక

పట్టి భూతభవిష్యత్తు లట్టె లాగి
వర్తమానచిత్ర మొనర్చి పత్రపు దెర
జూపి యేడ్పించి నవ్వించి సుకవి యెల్ల
జనుల పరసుఖదుఃఖభాజనుల సేయు

ఎవరో మీరలు మీకై, దివ్యసమ్మంతయును నేడ్చితినసక పాత్రల్
కవి తానై నుడివిననే, కవితానైజమ్ము తెలియగల దిలలోనఁ.



# మాతృహృదయము

తమ్ముఁడా! వినవోయి తల్లి హృదయమ్ము.
మాతల్లి యుదరమ్ము తాఁదిన్న యన్నమ్ము
వేవిళ్ల మిష వెలికి వెడలించి వెడలించి
తల దాచుకొన నాకు తా విచ్చెనోయి
నెలలు తొమ్మిది నిల్వ నీడ నిడెనోయి.

తమ్ముఁడా! వినవోయి తల్లి హృదయమ్ము
మాతల్లి గర్భంపు మడత జోలియ నుంచి
శ్వాసలను దెగిపోని చలువ యుయ్యాల చేర్ల
హృదయమ్మునకుఁ గట్టి యూపి నిద్దురఁ బుచ్చె
లేకున్న నాఁకలయి కేక లిడనే నేను
అట్టిట్టు నుఱుకాడి యల్లరులు సేయనోకో?

తమ్ముఁడా! వినవోయి తల్లి హృదయమ్ము
భూమిపై రాఁ గోర్కెఁ బుట్టవలె నాకనుచు
మచ్చుపెల్లలు గాను మన్ను నాకై బంపు
ఆ మట్టిలోఁ బండు నాహారముల నెల్ల
కోర్కెలను మిషతోడఁ గుడిచి రుచిఁ జూపించు.

తమ్ముఁడా! వినవోయి తల్లి హృదయమ్ము
నవమాసములఁజేయి సవరించుకొని నేను
యీవలికి రాఁగోర నేర్చు నేమోయి?
నా పొట్టఁ జీల్చుకొని నా పట్టి రానేల
యెడఁబాసి నేనెప్డు నీవ లావలి కేఁగ
నేమియగునో వీని నెవరిపయి నమ్మిచన
ననుచు కడుఁగష్టమున నవనిపై విడుచు నను.

తమ్ముఁడా! వినవోయి తల్లి హృదయమ్ము
నాతల్లి నెత్తుటివి నాళముల్ రుధిరంపు

ధారలను నామెయికి ధారవోసినవోయి
అడ్డమును నిలువు నా యణువణువునుం గూడ
నామె దేహమ్మె నాయందేమి యుండె మును
నాకు లోకముగలదె లోకముకు నేఁ గలనె?

తమ్ముఁడా! వినవోయి తల్లిహృదయమ్ము
నామేని యుడుకార్ప నామేనఁ బూతలిడ
మాయమ్మ మెయి తాను మంచిగంధపుఁ జెక్క-
యై నాకొఱకె యంత నరిగిపోయినదోయి
చచ్చిపోవునటన్న సమ్మతింపను నేను.

తమ్ముఁడా! వినవోయి తల్లిహృదయమ్ము
ఆమలకఫలమందు నలరు బీజముఁగాంచ
దానిమ్మగింజలను దనరు పలుకును గాంచ
నమలనదితోయముల నాడు చందురు గనఁగ
సరిగ మా యమ్మయెద మెఱయు చుంటును గనుల.

తమ్ముఁడా వినవోయి తల్లిహృదయమ్ము
మాతల్లి కన్నొకట మండు సూర్యుం డగుచు
పవ లనుచు నను లేపి పనిపాటలను నేర్పె
మాతల్లి కను చందమామయై చను నొకట
రేయి యని మము శయ్య హాయి నిద్దురపుచ్చు
తమ్ముడా! వినవోయి తల్లిహృదయమ్ము.

## గంటము : కఱ్ఱు

దేవుఁడా! నీవైన దివ్యలోకద్వయము
దిద్దుచుండెడి నట్టి ముద్దు హస్తము లేవి?
కవిరాజు గంటమ్ము కర్షకుని కఱ్ఱు
కవిరాజు కర్షకుఁడు, కంటిపాపలు నాకు

రెండు కన్నులనుండు రెండు లోకాలు
మింట మెఱుపులు మెఱియు వెంట మేఘము లుఱుము
కాసంత ధర పచ్చఁగానైన మాత్రాన
యినుప ముక్కలరెంటి కిగురు బుట్టునుగాదె.
కవిరాజు గంటమ్ము కర్షకుని కఱ్ఱు
యివిరెండు నొక తల్లి కవల బిడ్డలు గాదె

భూమిమీదను చాళ్లు నేమి వ్రాయుదు వురక
కఱ్ఱుగోలరొ నాకు కాసంత జెప్పు
మనుచు కవి గంటమ్మె యడుగుచున్నాది
ఎత్తువంపులు లేక యొడ్డు సమముగ నుండు
నటుల భూమినిసేయు నర్థమేమన్న

దైన్యంబు గర్వంబుఁ దనరకుండఁగ నుండు
మాకాఁపు హృదయంపు టాకారముద్ది
చెత్తమొక్కల వేళ్ల నెత్తి యావలవేతు
దుర్గుణంబుల నిల్లి తొలఁగించు కాఁపనుచు
నొక్కవిత్తిడి వేయి గ్రక్కింతు వడ్డితో
కుంచెఁడిడ పుట్లు పండించు మా కాఁపనుచు.

అంతటను చాళులుగ ననవరత మీ తీరు
ముత్తెములు చెమ్మటల మొలపించు మారాజు
కర్షకతపస్విదగు ఘనమహాత్మత్వమ్ము
వ్రాసిచూపఁగ నేను వచ్చితిని ధరపై
తమ్ముఁడా గంటమ్ము! తథ్యమా! కాదా?

కర్షకుని మాహాత్మ్యకథ సమగ్రముగ విని
కవిరాజు గంటమ్ము కాఁపు నిట్లనెను
బ్రహ్మసృష్టికి నీవు పాటుఁబడుచుండంగ
మింట సూర్యుఁడు నినొక కంటఁ జూచుచునుండె.
మొగుళులే మెత్తవడి మొత్తుకొను నీశ్రమకు

నింద్రుఁడే తన కనుల నేప్పుచున్నాఁడుగదె
బండకు జెమట బుట్టి పిండు చుండెను ఝరులు
కఱకుమానిసి కేమొ కడుపు పెద్దది యాయె
చెప్పరాకుండ నిను జీల్చుకొని తినును
బందుగై తానె రాబందు మాదిరిగ.



## చుక్క చూపు

చీఁకటిని మెఱయుచును వేఁకువనె బోదు
బ్రదుకు క్షణమాత్ర మని పలుకుదువె చుక్క!
ఉన్నచోటనె యుండి యెక్కడకుఁ బోక
ప్రతియూ రవని నున్న గతినె కనఁబడెదు
మూర్తి యున్నెడనుండి కీర్తి రూపమున
విశ్వ మంతటఁ దెలిసి వెలుఁగు మనుజె మము.

పృథివి కంటెను రూపు పెద్దగా నున్న
మినుకువలె మా కిట్లు గన్పడెద వేల
ఎత్తుపయిఁ గూర్చొనిన నెంతపెద్దేని
పెద్దతనముం జూప వద్దమటె పైకిఁ
బవలంత నీవు కన్పడ కుందు వేల?
రాత్రియో కనురెప్ప మాత్రమున్ విడవు
సుఖపుబ్రొద్దుల నిన్ను జూడ కుంటేమి
ఆపదల రాత్రులం దాదుకొనవలెగ
ననుచు సన్మైత్రి నిట్లలవరతె మాకు?
మామ కొన్నాళ్ళైను మోము దాచు నదేల
నీవొ ప్రతి నిత్యమును సేవింతు మమ్ము
ధనికులకొ యిలఁ బ్రేమధర్మ మే మెఱుక?
గర్వంబు నితరులను గాన నిచ్చునొకొ?
ఆ శశిని మచ్చమాయక యుండు వదియె
వచ్చునెడ నపకీర్తి జచ్చినను బోదు.



# జన్మభూమి

అరయ చావుపుట్టుక లను హద్దురాళ్ల
నడుమ దాగురింతల నాడుకొను ప్రపంచ
మున కదృశ్యమౌ నేలోకమున వసింతొ
దాని నెఱిగెడి త్రోవె జగాన లేదు

జననమరణ పూర్వమ్ము నా స్థాన మేదొ
దాని మరపించె నిట్టులే తల్లిప్రేమ
అరయ నేఁ బుట్టనే తల్లి దగుమనస్సు
కోసికొనె నింత యెవ డేర్చు కొంగుజాపి

మింటిమేఘాల నాయాత్మ మెరసి చనెనొ
అదియొ యేడ్చెనో నే నిట్టు లవతరింప
నాతనువు భరత భూగర్భనాళములను
గుప్తగతుల నే బీజాల సుప్తిగనునొ?

దానిగొన కోసికొనె భారతభువి మనసె
జననమరణ పూర్వమ్ము నా స్థాన మేదొ
దాని మరపించె భారతధాత్రిప్రేమ
బ్రతికినన్నాళ్లు నః దలపై నిడికొని
సాదె కోమలసస్యహస్తాలతోడ
భారతాంబదౌ ఋణ మీగు దారి యేది?

ఆనందజలధి నోలాడు చున్నవి యేమొ
చల్లగాడ్పుల నూగి పిల్లలతలు
కడుపార తేనెపాల్ గుడుచుటవల్లనో
హాసియించు చాడెడి కుసుమశిశువు
కడగొట్టుబిడ తోట కడురాగమున జూడఁ
బడి యులరెడి నట్టి పల్లవములు
అర్థించు ఫలముల నర్పించితి వటంచు
తలవ్రాల్చి భువిమ్రొక్కు తరుగణమ్ము

అకట జన్మభూమిని విడి యరుగలేక
రేబవ ళ్ళెండవానల గాబరలను
తప్పికొనఁజేయ తనువు ఛత్రముగఁ బట్టి
కన్నతల్లిని సుతు లట్లు గాచు కనుమి.



## అ గో చ ర ము

వేరులో లేదు తీవెలో లేదు
ఆకుల స్వేదక నందసలునకె లేవు
పూర్వజన్మపు దాని పుణ్యమేమో కాని
పూవులో నెటనుండి బుట్టె వాసనలు
పండులో నెటనుండి నిండె మధురసము?

విరిగిన్నె వాయుముడి విప్పికన్నుల వత్తు
లిడి చూచు వాయువులకే కనఁబడదు మధువు
తొలిచి తుడిచిన పాత్రవలెఁ దోఁచుగాని
ఆకాశయానముల నమరగణమై తేంట్లు
విరిగిన్నెలోఁ దీపి విందారగించి చను
బొట్టుఁబెట్టి యుదెప్పు బోయి చెప్పెను వాని
కన్నులకు మధువుతాఁ గనఁబడ నదెటులో.

మట్టిలోపల లేదు, నీటిలోపల లేదు
విత్తులో దివిటి నిడి వెదకినను లేదు
అతిచిత్రముగ నెవ్వ డందటి కనులఁ గట్టి
వన్నెలం దీర్చి వెలువక యుండునటులు
అన్నియాకులకు రం గంటించె నెవఁడు?



# తొలి వేఁకువ మేలుకొలుపు

రవరవగ వెల్గు తారాగణము లన్ని
దివిలోన వారంత యెవరింటి దీపాలో?
అవసరము లేదంచు నారిపోవ దొడంగ
వేఁకువం గనుటనో వివేకమ్ముతోడ.

మంచుమబ్బుల దుప్ప టూచు జల్తా రగుచుఁ
దొలిదెసన రవికాంతి తొంగిచూచుచు నుండె
హిమకణపు బాష్పముల నెల్లెడల రాల్చి శశి
సెలవు గైకొందునని చిన్నబుచ్చె మొగంబుం

చూడుమీ నాటకపు సూత్రధారిని నేనె
యని మొదలె మా కాఁపు నవుడె నిద్దురలేచి
త్రాడు దవులులఁ గూర్చి దాడపుందుడిఁ జేర్చి
ప్రకృతి రంగమ్ముపైఁ బ్రథమపాత్ర ధరించె.

అరయ నాత్మజ్యోతు లారిపోకుండ నెపు
డూదెడిని నా శ్వాస లూరకనె బోవంచు
నుపసమ్మతికిఁ జుట్ట నూది చెప్పక చెప్పి
కాపు నామము సార్థకము జేయుచుండె,
ధర బీదజన సేవె ధర్మ మని తలవ్రాల్చి
మాటాడకుండ నేమరక సేయు మటంచు
ఘన మార్గదర్శియై మునుముందు గోగణము
చనుచు కర్షకున కీచగవు నేర్పుచు నుండె.

ఉన్నతపథాలఁ జన నున్న మావలె మీరుఁ
బ్రొద్దుననె లెండనుచుఁ బులుఁగు లఱచెడి గూండ్ల
ఘనతఁ గోరిన వేఁకువనె మేలుకొనుఁ డంచు
బాలసంతుల గంట పలుకు ఘనఘన యనుచు
బ్రాహ్మీముహూర్త మిది పండుకొనరా దంచు
నోంకారరుతి శంఖ మోనమా లిడి సెప్పు
పలుదోమి నీరాడి పరిశుభ్రతఁ జెలంగు
మనుసు నూడుపుఁ జానిపిని రేగు శబ్దాలు.

---

# పట్టుదల

## నదము

ఈ దిబ్బ యెదుర మో మిటు దింపి చనెదు
ఆ గోఁతికిని బెదర కడినింపి చనెదు
ఎప్డు నీ గమన మది యిసుమంత నిలదు
కలియుచో నుప్పుడుఁ జనుగాళ్ల నే గలదు
భళి నీకు పట్టుగల బాగో నదమ్మ!

## జలదము

వడిగాలి వచ్చి నిన్నెడఁద్రోలి పాపఁ
బర్వతాగ్రా ల్నిన్ను బ్రతిమాలి యాపఁ
దుదిఁ జెఱువుగుంటలకె యుదరమ్ము నింతు
వది మాత్ర మూరుకోన వమ్మ జలదమ్మ!

## ఘాసము

వడయెండ వచ్చి నిను వత్తగా మాడ్చినను
గోగణము నిన్ను ద్రొక్కుడు జేసి పూడ్చినను
మొగులు కన్నీ రిడనె మొలచి నిలచెదవు
త్రొక్కు గోగణమునే వలచి పిలచెదవు
మాఱని తలంపు నీ మదిదె ఘాసమ్మ!

## లత

సుడిగాలి వచ్చి నీ మెడఁబట్టి త్రోసినను
వడయెండ వచ్చి నిను వాడఁగాఁ జేసినను
ఫల మబ్బు వఱకటన బడి చత్తుగాని
తొలఁగి చన వొకయడుగు దూరమును లతరో!



# వనస్వాంతము

ఎండలో నీ తప స్సొందాక యీ చెట్టు
కనియేమొ జాలిగొను హావభావా లల్లి
సోమలత ఛత్రంపు శోభఁ బైఁ బ్రసరించె
ఆచెట్టు నీచెట్టు నాకాశమార్గాన
నొండొరుల భుజశాఖ లొకటిపై నొకటి నిడి
గుసగుసలవెట్టికొను విసరు గాడుపుధ్వనుల
నంతరంగా లలరి యాడించు తలల నొగి
అటవీతరుగళాల హారాళివైచు లత
లాకాశ జాంగ్లప్రయాణాల నలతగొను
వనచర విహంగాళి మనము నుయ్యాల లూపు.
మలరాజు పంక్తులుగ నిలుచున్న వృక్షాల
పేరటాండ్రకు విందు పెట్టుటకుఁ గానోపు
కాళ్లు గడగఁగ ఝరీకన్య నంపెను దాను
అరుగు పాంథజనమ్ము కందుకుమొ లేదొ యని
నిలువ నీడ నొసంగి ఫలపుష్పముల నెల్ల
జలజలన్ రాల్చు వృక్షములు దారులలోన
బ్రకృతిదేవియొ తరుల .పరసమృద్ధికి మెచ్చి
ఫలతతిని చేత నిడి తలలపూవుల బెట్టి
పాదముల బట్టుకొని బయట కెటు జననీక
నట్టింట. గూర్చుండఁబెట్టి పోషించెడిని . . . .
ప్రేమించి పూజించి పెద్దగాఁ జేసెడిని.

# రాటంపు రొద

రాటమా ! నీ విట్లు రంయ్ రంయ్ మనుచు
ఘూటుగా నేడ్వఁగాఁ గారణ మ్మేమి?
ఒక్కొక్క విడియేకు నొకకండెఁగాఁ గూర్చి
వ్యక్తి యేకత్వమును వ్యక్త పఱచెదవె!

రాటమా ! నీ విట్లు రంయ్ రంయ్ మనుచు
ఘూటుగా నేడ్వఁగాఁ గారణ మ్మేమి?
దొడ్డ సన్నము వచ్చు తోరాలలోఁ దిండి
యుండిలేకను నిండి యుండు బ్రజఁ జూతు.

రాటమా ! నీ విట్లు రంయ్ రంయ్ మనుచు
ఘూటుగా నేడ్వఁగాఁ గారణ మ్మేమి?
అడ్డగ్గునకుఁబార కాటంకబడు నెఱుసు
పక్కదాస్యంపు బ్రతిబంధక మ్మనెదొ.

ధనికుల మెయిదీవెల మోమున నవ్వులఁబూవుల్
అనవరతము బూయుచుంట కా కారణ మేమొ
బీదలకడుపు చెఱు వాచు చేదెడి కన్నీటికాల్వ
లాదుకొనుచు వచ్చి వీని పాదుఁదడిపి చనునొ.

ధనికులయుడుపులు తెల్లఁగ మినుకుమినుకు మను చుక్కల
మనసుకన్న కడు నిర్మలమై కనఁబడు టేమొ?
బీద తాపసులమేనులు స్వేదజలదములై కఱఁగి
వదలక వీని మలినముల నుదికిపెట్టి చను నేమొ?

# కవీ!

అల్లసాని కవీంద్రు వెల్లనేనుఁగు నెక్కి
యూరేగుటలు దలఁచి యుబ్బిపోయెదుగాని.
అడ్గువారే లేక యాపూట గతిలేక
నెత్తురంతయు జచ్చి బొత్తుగాఁ దెల్లబడి
తిరిపెమున కింటింట కరము జాచుచు నీవు
తెల్లమొగమును వైచి తిరుగవే సుకవీ!

నాడు పెద్దన్న చరణాలలో ధ్వనియించు
గండపెండెర మెంచి నిండిపోయెదుగాని
యొకట తల నెత్తి నే నున్నా ననము నీకు
గలుగు నిరుగాళులకుఁ గడియాలు కలతు
పరనృపాక్రాంతాంధ్రధరణి నిపుడును నిన్ను
కలమాన్న మిడి సాదగల మానవులమాట.

కలమాట లాంధ్రకవి కలమా! తెలియుమా!
ఆరయ ప్రతాపరుద్రావేశబీజముల్
నేటికిని యోరుగల్ కోటలో నెలకొన్న
పంచాస్యగజములం బండఁబడిపోయినవి
స్వర్ణవర్షాంబువుల చవులు మరగిన వవియొ
మొలచునే నీ యశ్రువుల వానల కవీ!



# దర నెవ్వఁ డెఱుఁగు?

ముత్యాలవలెఁజూచి ముటియు నవి గా వివియె
జలరాశియుప్పు శుక్తి స్వాతి చినుకుల మోయి
యనుచు ముత్యముల పరిహాస మాడెడి రీతి
జొన్నలైయే యుండెనో మా కాఁపు
పున్నెమ్ములే పండెనో?

నాల్కపై రుచు లీను నవరత్నముల మోయి
ప్రేవుదండల కెంతొ జీవకళ లిడగలము
అనుచు వజ్రాలనే నడుగుఁద్రొక్కెడు భాతి
మెతుకులై ఉవ్వఁబడెనో, మా కాఁపు
బ్రిదుకులే నవ్విపడెనో!

అఖిలభూమండలం బరచేత నా వలెనె
యాడింతు ననుచుఁ జేరాస నేర్పడి మ్రోఁత
కోటీసులా సెట్ల గోటిపై మీటఁబడు
రూపాయ యను చిన్న రూపాయె నోయి!
జొన్నలారా! మీదు వన్నెరూపాలు
నవరసులలోని నీ నవరసా ల్నిండె
ధాన్యమా! నీదైన దర నెవ్వఁడెఱుగు?

పలికింప నాత్మస్తుతులు తేటబడు భాతి
ఘనశబ్దముల మ్రోగు నంచు మువ్వల గీతి
ధ్వనియింప కుండుటనో ఘనతఁ గాంచెను పైడి
దానికే నిడితివో దర నీవుఁ గూడ.



# అనుకరణము

చందమామా! నీవు స్వభమరమైనట్టి
కలువపువ్వు రూపురేఖలను చిత్రింపగా
ఆ గగనపత్రమున నభ్యాస మొనరించు
టురసిచూడంగ సృష్ట్యాదినుండియు యేమొ?
ఇప్పటికి వ్రాయుచునె యిటులురక చెఱిపెదవు
కలువ పూవులరూపు కలియ దేమోయి!
తేడాగలదు రంగు తేటికిని నీ మచ్చ
కా రేకుకన్న నీ యాకృతియె పెద్దదగు
నిదిగాంచి కలువపువ్వు లెగతాళి సేయునో?
నవ్వు నినుజూచి యెన్నడు రేయి గాంచినను
సర్వకాలములందు సాధించు చింతతో
నగముగా నీ వదియె నగమైనటులు దోచు
అంతతో నీవెంతో యానందమును జెంది
పుపురేకు చిత్రమ్ము పూర్ణముగ దీతు వని
నిండిపో నది యొకటె గుండుసున్నా చుట్టె
అనుకరణ మది సహజ మట్లుండగలదె?



# గేలిసేత

పైన బూడిదసేయు ఫర్మాయుషీ చుట్టఁ
గాల్వ డబ్బెంతయో కాల్వవలె నూరు
కడుపులోపలఁ గాలు కడుపేదవానిదా
పొట్టన్న నొకకాని బొట్టన్న రాదు.

చదువ వ్రాయను నుడువ సాఁగ వేనకువేలు
పదము లన్ననో రైలుబండివలె నుఱుకు
నదను వచ్చిన యుప్పు డాచరణగ్రంథాలు
పదుమన్ననో యొక్క పదమే నడువదు.

కనుపులోపలి చల్ల గదలకుండనె యింటి
కడపలోనె దినాలు గడపఁగా నెంతు
వడలఁ జలి వలలోనఁ బడు కాఁపుదా పెట్టు
బడి యిదియటంచు నీ బడి పారమిడెనె?

తలవంచి నా పాపఫల మంచుఁ జేయెత్తి
పదిసలాములుసేయఁ బదవి జిక్కెనొకో?
సూర్యచంద్రుల కోరచూపులకు నోడని
నాఁగేలి దున్నమననా గేలిసేతు.



## ప్రియురాలు

కొండలను మేఘాలు కౌఁజగానివిగ సేయ
పువ్వు లన చుక్కలకు నవ్వులాపై పోవ
సింగిణిలు లతల తలవంగెనని జూపఁగ
నదులఁ గని కెంజాయ నాలుకలు సాచఁగ
కుముదాబ్జముల నధీనము సేయ రవిశశియు
ఆ వసుంధర నల్పు నరయఁ జీఁకటి పుల్వ
దివికి క్రిందయ్యె భువిదీటె నాపని యనుచు
ఆ దివిని గెల్వ ముందడుగిడు ప్రియ న్వెలుఁగు
కురులు కార్మొగిళులకు నుఱులగుచు వ్రేలాడఁ
జుక్కలను పలువరుస వెక్కిరించుచునుండ
నా సంజకెంజాయ నారగింపఁగ మోవి
కాటుకలఁదీర్పఁ జీఁకటి పేరు మాపఁగా
నిరులోకములఁ గెల్చి యెటు జూడ నీక న
న్నందాలరాశియై యాకర్షణము సేయు
ప్రియురాలివదనమ్ము బ్రియమౌట ఘనమె?



# మిత్రవిరహము

ప్రొద్దాక సేవించి పోవుచున్నాఁ డినుఁడు
అని యమరవరు లెవరో హర్షించి జల్లిరో
బుక్కాగులా ల్పునఁగుఁ బూసినా రెవ్వరో
యను నటులు మబ్బు లవె యరుణసితకృష్ణవ
ర్ణాలతో నస్త్రాద్రిఁ దేలియాడుచు నుండెఁ
ప్రొద్దాక సేవించి పోయినాఁ డినుఁ డనుచు
నా గగనసీమంతినీ గాఢవిరహాంత
రంగమునఁ జీఁకట్లు రాఁజుకొనియున్న విదె
యారవి సమాధిపై నర్పించుఁ బువ్వు లగుచుఁ
దారావితాన మొప్పారుచున్నది దివిని.
ప్రకృతిదేవియు దనదు బాజారులంగళ్లు
మూసివైచినది యామూర్తి విరహమునందు
చింతాంతరంగంపు చిహ్నమ్ము దెలుపుటకు
బావురు మనియె నీ ప్రపంచగృహ మెల్లెడల
చిన్నవోయెను నెటిగ చిట్లు చీకట్లు పడి
మిత్రు నెడబాసి మోమెటు జూపగల మనుచు
తమ్మితో పాటు కనుదమ్ములను మూసె ప్రజ
తమ్ము లటు మూసె కనుదమ్ములను ప్రాణితతి.






ఆహిరీరాజ్యరమావల్లభ

శ్రీమంత్ ధర్మారాయప్రభువులు

చూ॥ పు॥ ౨॰

### ఆ హి రీ సా మ్రా జ్య ర మా వ ల్ల భ

# శ్రీమంత్ ధర్మరాజ సందర్శనము

చాందాజిల్లాలో ఘనత కెక్కిన ఆహిరీ సంస్థానాధిపతులు. వీరి తండ్రిగారి భుజంగరావుగారు. వీరి యనుజులు కీర్తివంతరావుగారు. ధర్మరావుగారి పత్ని నాబర్నా మహారాజు కూతురు, రాజకుమారీబాయి. ఈపెకు నిద్దరు కుమారులు. పాండురంగ దేవాలయ మొకటి గట్టించి అందు తమ రాష్ట్రచరిత్ర శాసనరూప స్థానిక పండితులగు శ్రీ లక్ష్మణాచార్యులతో సంస్కృతమున వ్రాయించిరి. వీరి క గాయకులు, జ్యోతి, మోతీ, సద్ధా మొదలుగాఁగలవారు. వీరు కొంతకాలము 'రూరు ప్రసిడెన్సి మినిస్టర్ గా నుండిరి. చాల ధర్మాత్ములు.

ఉగ్రుఁడై భుజగ మట్లూర్పులు విడుచుచో
　　వాయుసూనుఁడు గానవచ్చు నపుడు
కార్యసాధనకయి గడఁగుచుండెడి వేళ
　　విజయురూపమును సేవించ వచ్చు
అశ్వాధిరోహణ నశ్వినీదేవ సం
　　జాతుఁడౌ నకులుని చాయఁ దోచు
పాండురంగాది దేవప్రతిష్ఠాదుల
　　సహదేవుఁ డౌచు దర్శన మొసంగు
ద్వాపరమ్మున వెవ్వేఱ దనరియేని
నైకమత్యాన భ్రాతతో నలరినాము
కాని కలియని నలువు రగ్రజుని లోనఁ
గలిసి యీ ధర్మరాజుగా వెలసిరేమొ?

ఆర్తజనాళికి నతని జాతకచక్ర
　　మా చక్రి చక్రమై యరసి తిరుగు
అతని కంఠము శంఖమై గుణించు సతమ్ము
　　దీనప్రజాభయదానరవళి
అతని హృత్కమలమ్మె యఖిలప్రజాభాగ్య
　　లక్ష్మీనివాసనిలయము గాదె

అతని దానోదకమ్ము తా నమరతరువు
కలిని దల నెత్తఁగా జీవగంజిఁ బోయు
నతని చిఱునవ్వు వెన్నెల లవనిఁ బర్వ
ధర్మదారిద్ర్యతమము విధ్వంస మయ్యె.

ఏ ప్రభు సౌలభ్య మెంచి చూడఁగ చంటి
పిల్లలకును దోఁచు పిల్లనివలె
నేరాజు పెత్తన మ్మెంతో పెద్దలకునే
నఱ్ఱుసాచినఁ గూడ నందకుండు
ఏ వీరు శౌర్యమ్ము నెట్టి బెబ్బులులకున్
బెబ్బులియై మృత్యుభీతిఁ గొల్పు
ఏ ప్రభుజ్ఞానమ్ము నెట్టిజ్ఞానుల బుద్ధి
కందని వ్యాప్తితో నమరియుండు
నతఁడు సకల కల్యాణ గుణాంచితుండు
ఆహిరీరాష్ట్రభార వాహకుఁడు సుజన
హృదయరంజకుఁడును రిపుమదహరుండు
ఆ నృపుండు నరుండె! విష్ణ్వంశజుండె!

నవ్వులు నవ్వుమోము కరుణన్వెదజల్లెడి చూపు విజ్ఞులన్
పువ్వుల ఱువ్వు నాసరసపుంబరిభాషణ మార్తరక్షణం
బెవ్వరి గుండెరాని ధృతి యెంతో యుదారత లబ్బుటన్నచో
నవ్వులుగావు ఈ ప్రభుఁ డొనర్చిన పూర్వపు పుణ్య మెట్టిదో.

రాజకుమారి యా జనకరాజకుమారికి నీడువచ్చు మా
రాజును ధర్మరూపమున రాముఁ డయా యనునట్టు లొప్పు శ్రీ
రాజితులైన వీరికి పరాజితరాజముఖాంబుజాతవి
భ్రాజితసూను లిర్వు రిల భాసిలిరో కుశుఁడున్ లవుం డనన్.

ఎవ్వని కన్నుజ్యోతులు నహీనరుషార్చుల గర్వితాంధకున్
చివ్వున చీఁకటుల్ దుడిచి చెచ్చెర సత్పథ మబ్బఁజేయు తా
నెవ్వని కన్నుదమ్ము లవి యెంతో దయారస మొల్క రిక్తుపై
రివ్వున భాగ్యలక్ష్మి ప్రసరించునో యాప్రభుధర్మమూర్తియా.

ధర్మమె శిష్టరక్షణము ధ్వాష్ట్యవినాశనముం బొనర్చు స
త్కర్మల సేయు పాండవుల ధర్మసుతుండయి యేలె నా యస
త్కర్ముల కౌరవాదుల వధంగొన నయ్యెను ధర్మరాజె యా
ధర్మమె పేరుఁ జెప్పుకొని తా నహర్ప్రజ నేలు నాగతిన్.

గంధర్వులకు సరిగమల నేర్పంగఁ జాలి
తుంబురు నారదాదులను బోలి
గానభారతి శిరోగ్రమునఁ దాల్చెడి మణి
జ్యోతియో హారంపుమోతియొ యన
నాసికాభరణమా నత్తునానేమొ నాఁ
బలువురు గాయకుల్ వెలయుదు రెట !
వాగ్దేవి యందాల వన్నె దిద్దఁగఁజాలు
సుకవిప్రవక్త విశుద్ధశీలుఁ
డాహిరీరాష్ట్రి చరిత మహాప్రబంధ
శాసనాదిక కర్త లక్ష్మణబుధుండు
ప్రభుదయాపాత్రుఁ డాస్థానపండితుఁడుగ
వెల్గ సంగీత సాహిత్యవిమలవాణి
బ్రతుకు నాహిరిన్ ధర్మరాట్ప్రభునిఁ గొల్చి.

ధర్మ మెట నామగుణములఁ దనరఁగలదొ
ధర్మరూపియై శ్రీహరి తానుగూడ
విజయరథమును దోలునా వెరుగ నిల్చి
ప్రబలసాక్షి దీనికి ధర్మరాట్చరిత్ర.

నీదుతండ్రి భుజంగరా వాదిశేషుఁ
డై ధరణితోడ నిత్య మా హరినిగూడఁ
దాల్చి చెప్పు శాశ్వత మిల ధర్మకీర్తు
లనుచు ధర్మరాట్కీర్తి రాట్తనయులఁ గని
రాగివలెఁ దోఁచు గొప్ప విరాగి వీవు
భోగివలెఁదోఁచు ఘనరాజయోగి వీవు
పయికిఁ గోపించినను లోన పరమకరుణ
జిలుక నలరెడి నారేళఫలము వీవు.



# తేనెటీఁగ

## గీతావళి

తేనెటీఁగరో! నీ కూర్చు తేనెకంటె
నీదు పేర్విన్న చెవుల తేనెలు గురియును
నోట నుచ్చరించిన తేనె లూట లూరు
చూచి నంతనె కనులకు సౌఖ్యఁ గల్గు.

ఈఁగజాతిలోఁ జేరిన ఈవు తొలుత
తేనెలోఁ బుట్టితివా మఱి తేనెయె యది
నీదు గర్భాన బుట్టెనో నే నెఱుంగఁ
గాని నీపేరు మాత్రము తేనెటీఁగ.

ఎచటి కేగెదో తేనెల నెట్లు గూర్తో
కూర్చి తెట్టెయ న్పాత్రిలోఁ జేర్చు టెట్లొ
ఎపుడు గూర్తువో మధురిమ నింతదాని
సందుసందున నెట్టులు పొందుపఱుతో.

అమృత మెచ్చటనో గల దంద్రుడు గాని
ఎవ్వడును దాని గ్రోలియే నెఱుఁగఁడయ్యె
మాకొఱకు మాత్రమో మధుమక్షికమ్మ!
నీదు నుచ్ఛిష్టమే యమృతోదధి సుమి.

అమృత మనునది మధురిమ యందు నీకు
తీసిపోయి నీ వాతెర తీపు గ్రోల
వచ్చి నీముఖమధురసవార్ధియందు
కలిసిపోయె; లేకున్న నెక్కడికిఁ బోవు?

తేటి పూవు పూవున వ్రాలి తేనెగ్రోలుఁ
నంతియేకాని నీవలె నది మధువును
సంగ్రహించి యన్యుల కిడఁ జాలదయ్యె
స్వోదరపరాయణులకుఁ గలాదె యీవి?

రసికురాలని మధుపము నసదృశముగ
జనులు కొనియాడుదురు మఱి నిను దలఁపరు
తలఁచ రని చేయుమాత్రము దాచుకొనవు
సజ్జనులు మాఱుఁగోరరు జగతి నెందు.

తేటి కవులకుఁ బెట్టినదియును లేదు
దాని పేరన రామమంత్రమ్ము కవికి
మధురసప్రదాతవగు నిన్మఱచిపోయె
నెంతటి కృతఘ్నజాతియొ యీ కవి దిల!

మధుప మెపుడుఁ జూచినను సుమప్రియపయి
ప్రాలి యుండు మానమ్మును వదలివైచి
కాని నీవు సుమప్రియం గలిసె దెపుడో?
తెలియ దిదె మానధనుల రతిక్రియ యన.

మధువుఁ గొన నీదు తెట్టెఁ జేర్మానవులను
నీవు కఱతు వంచునుగదె యేవగింతు
నీదు గారాబుకూనలఁ బూదిఁ జేయు
కటిక మనుజులఁ గఱచుట కాని పనియె ?

పూవు వాడిపోకుండ నాపూవు లోని
మధువు గ్రోలెడి నీదగుపదవి యేడ
నీబిడల యుసురుల్గొని నీధనమ్ము
కొల్లఁగొను నరహాతకుల గుణ మదేల?

ఎంతొ కాలము శ్రమపడి యెట్లో కూర్చి
తెచ్చికొని దాచికొన్న నీ తెట్టెలోని
మధువు నెల్ల నీ బిడ్డలఁ బొదివి చంపు
పాపులకె పంచి యిడుటె యీ పాప మేమి?

అపుడు కడుపు మండినదన్న నబ్రి మేమి?
కఱచినా వన్న నందు నీ కలుష మేమి?
కాని నీకు నీ కూనలు గనఁబడ రిక
కడుపు కోఁత యింతింతని నుడువ వశమె?

నిన్ను బిడ్డల కెడఁబాపి నీ నిసువుల
నోటిముందరి బుక్కను వీటి బుచ్చి
లాగికొనఁజేతు లాడు ఛేలాగో తెలియ
జ్ఞానవంతులౌ మనుజుల కార్యము లివె.

కనులు దెరవని గ్రుడ్డులు గావె పాప
మనుచు దయ విచారించెడి జనులు లేరొ
సాదుకూన లవింత యనాథలు గదె
యనుచు మనమున నెంత యాయాసపడితొ!

ఎంత యేడ్చితో యాపయి యేమయితివో
దాని నరసెడి వారె జగాన లేరు
స్వీయసుఖముకై పరుల హింసింతురు గదె
మానవులు రక్కసులకంటె మఱి కఠినులు.

చాల గాసిలి రెండవజన్మ మెత్తి
తాను గూర్చిన ధనమును తాను గనిన
కూనలనుగూడ క్షణమున గూల్చినంత
గుండె యేమగునో కనుఁగొనుఁడి మీరె!

నీవు గార్చెడి కన్నీట నీవు జేయు
రోదనరవాల గుండె నిర్భేద మయ్యొ
అయ్యొఁ జేసిన దేమి లేదయ్యొ నీకు
కాల్పనే! యిట్టి మాదు రాకాసి తనువు.

మిగుల నెత్తగు తలమున నగపడనటు
గుబురుగా నుండు మరుగున కోరి కోరి
ఎంతో నేర్పున గృహము నిర్మింతు వీవు
హింసకుల సహావసతి నీ హీన మనుచు

దుష్టులను గని దూరమె తొలఁగవలయు
ననుచు నెంతయు గుట్టుగ మనెడి నిన్ను
పొట్టుపోదించి యెట్టులో పట్టుకొంద్రు
జగతి సుజనులు బడు నగచాటు లవియె!

వచ్చె నెంతలో నీ కుటుంబప్రళయము
కన్నుమూసి తెఱచునంత మిన్నువిఱిగి
మైనఁబడిన దింకేమిటి బ్రదుకు తల్లి
వెదకె దేరి నీ గోడును విను నెవండు !

అయిన నెంతమాత్రమును నీ యంతరాత్మ
గూలనీక వేఱొక్కచో శాలఁగట్టి
యందు మఱలఁ గాపురము సేయం దలంతు
ధైర్యవంతుల కార్యపద్ధతియె వేఱు

ఇట్టి నీ యుదాసీనత పట్టుదలయు
మానవులనైన తెఱచుగాఁ గానరాదు
నీదు పనియేమొ నీవేమొ నీదుగాన
మాధురి యదేమొ తెలియదు మాకు తల్లి !

నీ నిసువులకు నీకును నీ ప్రియునకు
మా నమశ్శతమ్ములు మధుమక్షికమ్మ!
ఏలనన కలిలోనుండియేని నీవు
కృతయుగంపు ధర్మమ్ముల గతి నెఱపెదు

తల్లి మధుమక్షికమ్మ ! నీ దాసజనులు
తెలిసియో తెలియకో నీకు సలిపినట్టి
తప్పులను పొట్టలోపల దాచికొనఁగ
ప్రార్థనము సేతు నూరకఁ బ్రాలుమాలి

నీవొ యొజ్జవు జనులు నీ నీడక్రింద
బ్రదుకువారు తా మవసరపడి యొకప్డు
నీదు నెంగిలి నడిగెద రాధుకొనుము
కష్టమన్ననొ వదలరు గాదె నిన్ను.

మెడఁబడినపాము కఱవక విడువదుగదె
నిన్నుఁ బెంచుచు నీదగు చిన్ని బిడల
యుసురు బోసికొంటకె నరు లాదవిరిగదె
తప్పుకొనుటకు నీకును దారిలేదు.

కర్మమని వీరి కొఱకయి కన్నబిడల
చంపికొని మైన మధువు నోసంగె దీవు
ఎంత తెగువయే తల్లి! నీ యంతరాత్మ
లోన జో టానంగుమ యిదొ లీనమాదు.

## గ్రామ సూకరము

ఊరఁబంది జన్మ ముత్తమోత్తమ మని
చాటఁజూచుకంటె సాహసంబు
వేఱ కానరాదు పీటిడియైన నే
వ్రాయఁబూను దాని వైభవంబు.

అనుచు వ్రాయువాని పనిలోనెయుండుట
గొంద ఱాడిపోసికొందు రేమొ?
వినఁ నేమివ్రాయు నాతఁడు పందికి
మేన మామ చుట్టమైనఁగాఁడు.

బావమఱఁది గాఁడు పక్షబుద్ధిని బూని
లేనిపోని వెన్ని గాని వ్రాయ
మలముఁ దిను నూరబంది పై కలము తాను
పరువులిడుచెందులకొ యట తరుగనట్టి
దాస్యధన మేమి యుండెనొ ద్దాని కెఱుక.

సర్వంసహాకష్టసహనశీలమ్మును
గాంచి నీ హృదయమ్ము కఱఁగెనేమొ!
పరమేశు నిల్లాలి పరమపావనమగు
తిరుమేన దుర్గంధ భరితమైన

మనుజుల విష్ఠను గనలేక దానిని
యాహారముగ లోనె యడఁచినావో
దుర్గంధకూపానఁ దోగుచు తత్ప్రజల్
రోగులౌదు రని తద్భోగివై తె
ఘోరతప మొనరించి నీ కోరికొనిన
వరము దుర్గంధ మలమును ధరణినుండి
యాహారించుటయే యేమొ యట్లైకా ని
దేమిటికి సృష్టికర్త సృజించె నిన్ను.

ఏమొ యనుచును సందేహ మేల నాకు
నీదు జన్మము ప్రియపడి నిఖిలలోక
సృష్టికర్తయె తానెత్తె సిగ్గువిడిచి
నేలనెత్తుట కిద్దియె చాలుననుచు

అపుడె యెనలేని మాన్యత కర్హుఁడయ్యె
కాకయిది నిహీనంబని కసరుకొనుచు
దోసములు గలవానిని ద్రోచివైచు
ప్రభు క్షమాశీలతకు భంగపాటుగాదె!

తా జగత్కుటుంబియె యిటు దాస్యమునకు
నిన్నె కడపటి హద్దుగా నిలిపియుండి
నీ స్వరూపమె దాలిచి నిలిచె ననిన
నెంత గర్వించవలయు నీ యొసకమునకు.

బురదలో పొరలాడు బుద్ధియే కాని తాఁ
బన్నీరు మెచ్చునే పంది యనుచు
పందివై పదియేండ్లు బ్రదుకుటకంటెను
నందివై నాలుగు నాళ్ళె చాలు
పంది గున్నవలె తొంబకుతొంబ బలిసినాఁ
డెంతయు సోమరి యీ జడుఁడని
ఎందుల కీ కాన్పు పందికన్నట్టుల
కని విడ్చినాఁడు పెక్కండ్రనుచు

అన్ని యవగుణమ్ములకె నిన్నద్దముగను
గొట్టదాఁటుడుగా జనుల్ గొంద్రు గాని
వానిలోనున్న సూక్ష్మభావాలఁ గనరు
కాంచఁగల్గువానిని గుణగ్రాహి తానె.

బురద పన్నీరుగ వరియించు టది నీదు
 వృత్తికి సరిపడు వేషమేమొ
పెక్కేండ్లు బ్రదుకుచే తక్కువ యని లోక
 సేవ కింకను సాగు భావమేమొ
ఈతకు పదికూన లేసిగా పెక్కేత
 లీనుట యితరులు పూనరాని
మలనమున్మార్జనమ్ములకు చాలవటంచు
 కొసరుకొనెడి దాస్యరసమొ యేమొ
నీవె యెఱుఁగుదు సూకరదేవ! నిన్ను
పుట్టఁజేసినవాఁడె యా గుట్టుదెలియు
నీదుకలరూపుఁ దెలియఁగ నేరమికిని
వగచుచున్నాఁడ నిష్ఫటివడకు నేను.

దుర్గంధశేషము దూరెనో గర్భాన
 యని ముట్టెలను లోన జొనిపి జొనిపి
మట్టి పెకల్చుచు మంచి ముస్తెల కమ్మ
 తావిని గని యిఁకత్రవ్వకుందు
ఏమి నెమ్మది యయ్యోనే యింక మీఁదట
 నది రవంతైన లేదనుచు నీకు
దవడలో ముస్తెలఁ దవిలించి చూచుట
 వస్తుయాథార్థ్యముం బడయుటేమొ
పరమ దుస్సహా దుర్గంధ భరిత మలిన
కూపమ్మునఁ బడి మునుఁగుచుఁ గొట్టుకొనెడి
లోకమును బైకిఁదీయుటకై కననగు
నిద్ది స్వీకరంబనుట నీకే తగుఁజుమి.

సూకరమ! నీకు మలమును బోకడఁచుట
సుకరముగుటఁగాఁబోలు విన్కికి మధురము
సంస్కృతంబున మిక్కిలి స్వాదువైన
పరమ సార్థకనామముఁ బడసి యుంటి

ఆ సువర్ణమె తన మలినాపహారణ
మునకు నీ రోమసత్సంగములె కతమని
నీ సువర్ణ మెంచగ లేఖినీముఖముగ
నరచెడి సువర్ణమయసువర్ణాళి నిదిగొ.



## ఊరఁబిచ్చుక

ముకుపచ్చ లారని ముద్దుబిడ్డల విడి
    పోలేక పోలేకఁ బ్రాలుమాలు
చాఁకలికై బిడ్డ లఱచెడి యఱపును
    విని గుండె లవియగా మనసు నెట్లొ
తాఁయిఁజేసికొని బిరాన నెగసిపోయి
    యింతలోన బొట్టె లేమయి రొకొ
యనుచు మధ్యమధ్య నరుదెంచి కూనల
    ముద్దు బెట్టికొనుచు మూర్కొనుచును
ఏఁగి యందందు చిక్కిన యోగిరమ్ము
నీదు ముక్కున గీలించి నిసువునోటఁ
బదిలముగ దాని నిడెదవు పక్షిడింభ!
యెవరు జెప్పిరి యీప్రేమ యింతలోనె.

కనఁబడిన పుల్లఁ బోనీక కడుపరుగున
ప్రాలి ముక్కున దానిని గీలు పఱచి
తెచ్చి యిల్లట్టఁ జూచెదు తీవ్ర పడెదు
ఏటికే యింత యారాట మెవరి వద్ద
నూరఁబిచ్చుక యీ నేర్పు నేరిచితివె?

ముందు కలుగఁబోయెడి కసుగందువులకు
నిప్పుడే యిల్లు గట్టఁగ నెంచినావె
అమ్మరో! యూరఁబిచ్చుక యప్పుడు గాంచి
బోయ కన్నుల నిప్పులు బోసికొనును
పౌరిఁ బ్రజాసేవను మునుంగు పూరుషులను
పడి యకాలమృత్యువు వాత నిడికొనినటు.

బిడ్డలకు నోడ లొత్తున న్బ్రీతిచేత
మెత్తమెత్తని వరిపోచ లెత్తి తెచ్చి
వాని నొండొంటఁ జేరిచి పఱచివైవఁ
జూతు వీవు దైవవశాన జొప్పడ దది
సకలప్రజలను సుఖపెట్టఁజాలునట్టి
యైకమత్యమ్ము, పొసగింప నగు శ్రమ యిటె

నీవు బెట్టుకొలందిని నిలువక యది
క్రిందఁబడుచుండు నలయక యందె చేర్తు
ఇట్టికార్యశూరత యది యెట్టు లబ్బె;
యిట్టి పట్టుదలను నేర్పి రెవరె నీకు?
ఊరఁబిచ్చుక నీదగు నోర్పుగుణము
నేర్చుకొన నన్ను నీకడఁ జేర్చికొనుము.

# ఎండుగడ్డి వేరు

కోటికి కోటికి చంపుబిడల కొటుకు నీవు
మిత్రకరములు నిన్ను బల్మిని దహింప
మాడుచును కొనయూపిరి మసలి మసలి
ధాత్రి నన్నిగఁబట్ట వదలమి సన్న
గిల్లి సార మింతయు లేక తెల్లవోయి
బిడలకాళులఁ ద్రొక్కుడుబడుచు నుండి
బిడల మలమూత్రముల మురుగుడుఁ బడుచునుఁ
బైకి భస్మమై దావాగ్ని పాలఁబడుచుఁ
ప్రేమపారవశ్యముఁ జూప నేమముఁగొని
ప్రాణముల నేయణువున డాపఁ గడగితివో?
మఱల కాలవశాన నంకురిత మగుదు
వమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు.

నీదు బిడలగు గోవుల నిత్యశుభము
మొదల విబుధులు గోరుచు మురియుచుంద్రు
పితరులన్ దృప్తిఁ గొల్పెడి వేళలందు
దర్భ లేకున్న నిన్నెప్డు దడవుకొంద్రు
నీ పవిత్రతఁ దెల్పెడు నిష్ఠఁ గల్గి
అమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు.

పాన్పెఱుంగని బిడ్డల పాలి యాకు
పచ్చవన్నె మేలిమి పట్టుపాను పగుదు
పొట్టపై బిడ్డలన్ గూర్కు పొందునట్లు
కడుపుల నిన్నింపి జోకొట్టు కన్నతల్లి
కడుపుప్రేమ నీదే – యెండు గడ్డి వేర!

ఱాతిగుట్టల సందుల లోఁతు నీట
నిలచి మోమెత్తి కందువు నీదు బిడల
క్షరములం జూచి గాలిచే గదలుచుండి

పిల్చుచుందువు నీ ముద్దుబిడలగమిని
కడుపుప్రేమ నీడె యెండుగడ్డివేర!

అడవి నుండు నీ యందాలబిడలు లేళ్లు
వాని చర్మాలశాంతిని పాదుగొల్పు
ననవరతము ధరింతురు మహర్షు లెల్ల
జగతి నాహారశుద్ధిని సత్వశుద్ధి
యన్నమయము మనంబను నార్యసూక్తు
లన్వయించు నీయందు ననన్యముగను
అమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు.

ఊరిలో నుండు నీముద్దులూరు బిడలు
సర్వథా లోకసేవకై సాగుచుండఁ
పంచగవ్యప్రాయశ్చిత్త పద్ధతిగని
స్మృతుల ధర్మిష్ఠు లెల్ల శాసించుచుంద్రు
త్వదుపజీవిగోగణప్రశస్తతను దెల్ప.

అడవి నూర నెల్లెడ నీవ యలముకొనుచు
నల్లిబిల్లి నల్లుకొనుచు నైకమత్య
మఖిలసమత లిట్లుండని యవనిఁ జాటఁ
గడఁగితేఁ జెప్పకయె యెండుగడ్డివేర!

వేళ్లతో కృషికులు దున్ని పెల్లగించి
నీళ్లు మునిగించి మురిగించి నిన్నుఁ జంప
మఱల నేనే ననుచుఁ బైకి మరలుదు వహొ
విడఁగలేని ప్రేమమ్మును విడఁగలేక
గడగడకు మొల్చెదవు యెండుగడ్డివేర!

నేల నీ స్వరూపము దాఁచి నిల్పికొందు
వెట్టకేలకుఁ బ్రాణాల నెంతో పేర్మి
నగ్ని జలవాయువుల కష్టమంది గూడ
తనబిడలకు ధనము దాచు తల్లియట్ల
అవసరము గని వెలిబడు దప్పుడపుడు
అమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు.

పాపకాల మెప్డప్డు నిన్నరిభవింప
రూపనాశమున కేని నోపికఁగాని
నిర్భరతఁబూని విజ్ఞాననియతిఁ గాంచి
సత్ప్రసన్నని చందంబు సాటు చుందు
వమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు.

జగతి సర్వము కాలవశంబె యైన
నట్టి కాలమె నినుఁగని యచ్చెరువడు
రూపమే జన్మమరణాల కాపురంబు
కాని చెడని స్వరూప మీకరణి నుండు
ననుచు పాఠంబు జ్ఞానుల కలవరతువె
అమ్మ! యమ్మ! శుష్కతృణమూలమ్మ! నీవు.



# నిజాంరాష్ట్రపు బీద వెట్టివాఁడు

కటికుతురక యాఫీసర్ల కాళులందుఁ
బడుచు వంగి సలా మని వాకొనుచును
పొట్ట కేమిలేకయు వారి తిట్టులఁబడి
వెలయుదే నైజాం బీదవెట్టివాఁడ!

ముల్లెమూటల పెట్టెల మోసిమోసి
కాలి నడక నెంతో దవ్వు గడపి గడపి
దప్పి నాఁకలి నెట్టులో డాచి డాచి
చెమ్మటలుగార నెండలోఁ జేరినిల్చి
వానతాకున తడిసిన వస్త్రములను
చలికి కులుకులఁ గూయుచు సాగిసాగి
నడచుదే పనులఁజేయు నాఁడు నాఁడు
ఘోరతాపసివలెను గోసరిలుచు
శాంతిమెయి లోక సేవకై సాగుచుండు
వీరుఁడా! నైజాంబీద వెట్టివాఁడ!

ప్రేప బెత్తపుఁ దెబ్బల వీపువాచు
జోడు దెబ్బల వృషణముల్ గూడ దేల
నే గులామును సర్కారు నిందుపేర్మి
నన్ను దయజూడు మంచును నాదొసగుల
మన్ననము సేయుమని వేడి మానము విడి
దాస్యకంకణదీక్షావిధానముఁ గని
గోఁచిపాతరాయుఁడ వయి కూర్కు లేక
కడకు నెముకల పంజర ముడికి పోవ
పొట్ట మూరెఁడు లోఁతున మునిఁగి పోవ
కండ యే యవయవమునఁ గానరాక
నీదు నెత్తురు బొట్టుల నీవె త్రావి
దైవమును గూడ దూరక దాస్యవిధిని
నెఱపుటయు నిజోచితవిధినియతిఁ గాఁగ
నయభయాల పేరిమి మెయి నవ్వుమొగము
వెలి బఱతువె నైజాం బీదవెట్టివాఁడ!

మానవాసురు లనఁదగు మానిసులను
ఈ సొకించుక లేక విశ్వాసము గొని
తండ్రి యంచు నైచ్యానుసంధానము గని
పరసమృద్ధికి సంతోషపడుచు నుండు
వీరుఁడా! నైజాం బీదవెట్టివాఁడ!

బత్తెమును జీతమును లేని బంటువగుచు
బ్రదికి యున్నంతకాలము బానిసవయి
ఆలు బిడలకు బందుగు వోలె నుండి
నీ గృహస్థతాధర్మము నెఱపు నట్టి
వీరుఁడా! నైజాం బీదవెట్టివాఁడ !

నేల సెజ్జగా తలదిండు కేలు గాఁగ
కప్పు పైగుడ్డ చర్మముగ నిదురించి
నీ వినాదైన్యజీవననిష్ఠ బ్రిదుకు
వీరుఁడా! నైజాం బీదవెట్టివాఁడ!

# వృద్ధ పితరులు

చంటిబిడ్డల మగు మేము జబ్బు నొంద
మందుఁ ద్రావి పథ్యముఁ జేసి మాకొఱకయి
కంటఁ గన్నిడి సాకి మీ కండ నెదురు
పెట్టితిరి మాకు మా వృద్ధపితరులార!

ప్రియహితంబులఁ గోరుచు ప్రేమమెయిని
నయభయాల విద్యాభ్యసనం బొనర్చి
పెండ్లి పేరంటములకును ప్రీతుల రయి
పెంచితిరి పేర్మి మావృద్ధపితరులార!

దాచి మూసిపెట్టిన తల్లి దయకు నటులె
కష్టముగ సొమ్ము నార్జించు కన్నతండ్రి
కరుణ కర్థంబు జెప్పెడి ఘనులు గలరె?
కుతలమున నెందు మా వృద్ధ పితరులార !

పారమార్థిక మైన ప్రాపంచికంబ
యైన మీరు జెప్పక మాకు నలవడు నెటు
జ్ఞానమునకు వేఱొక తావు గానఁబడదు
సతము మిమువినా మా వృద్ధపితరులార !

రక్తమాంసముల్ మాకై కరఁగి ప్రవహిల
నూగుచుండు చర్మంబులఁ గ్రాగిపోయి
భార మిన్నాళ్లు మోయుచు వంగినట్టి
హితతనువ దేమొ మావృద్ధపితరులార !

ఇంగితజ్ఞుల రగుచు మా కెప్పు డేమి
యవసరంబొ యద్దాని మే మడుగక మును
కష్టపడి తెచ్చి పెట్టిన కారణంబు
నితరు లెఱుఁగరు మావృద్ధపితరులార !

అరయ "మాతృదేవోభవ" యనెడి శ్రుతిని
అట్టులె "పితృదేవోభవ" యనెడి శ్రుతిని
వినిన యప్డె మీ గౌరవ విధి తెలిసెను
వితతవిజ్ఞత మా వృద్ధపితరులార!

వృద్ధులగు మిమ్ము సాకని ప్రేతజన్మ
వెదురుచెట్టునఁ బుట్టిన విత్తనంబు
కారణము నశింపఁగఁజేయుఁ గార్యమల్లె
వేళ్లతోఁ జెడు మావృద్ధపితరులార!

లోకకల్యాణ విషయస్సై లోక సేవ
కై భవద్రూపమును నిల్ప కడకు మిమ్మె
సాకమిని యాత్మహత్య నిశ్చయము వీఁడు
విశ్వహితుఁడోకో మా వృద్ధపితరులార!

అహిత మపకీర్తి గల్గుకార్యములఁ జేయఁ
గప్పిపుచ్చి సేమమెగోరి కాచు చుంద్రు
పారిపోవ ప్రేమను వెంటఁబడిన వ్యాసు
గతిని గనవలె మావృద్ధపితరులార!

సకల జపతపోదేవతార్చా విధులను
మాకొఱకు పుణ్యపురుషార్థమహిమ వీడి
సంతతికిగ నసువుల విడజను వసిష్ఠు
గతిని గనవలె మావృద్ధపితరులార!



# పెంట పేలిక

సర్వసంగపరిత్యాగశాంతమూర్తి
పరమహంసల కాంత్ష్యమై బరగు దీవు
పెంటపురుగుల నోములపంట వీవు
అచ్చెరువగు నీసమత పటచ్చరంబ!

మును కుచేలుఁడు శ్రీకృష్ణుపురముఁ జేరఁ
బిడికెఁ డటుకులకై నిన్ను పుడికి చూచె
వారె నీ గరిమ మెఱుంగువారు నీదు
భాగ్యమును పెంటపేలికా! పట్టిచూడ.

బీదసాదల దుర్గతి విధిని గనుచు
జీర్ణదశ నొంది కలవారి చెమటముఱికి
నోర్చి భరియించి యీస్థితి నొంది తీవు
నీ పవిత్రరాగోదంతనిష్ఠఁ దెలుప.

నీవు విసుగమి వారలే నిన్ను గుఱిచి
విసిగి పనికిరావని పెంట వేసినంత
భాగ్య మని భాగ్యహీనుల భాగ్యమ వయి
మురియుదే పెంటపేలికా! బొంతఁ జేరి.

కష్టసుఖములనో సమకాష్ఠ నునిచి
సకల జంతుసేవకయి దీక్ష వహియించి
మంట మన్నగువఱకును మసలు చుండి
పెంట పేలికా! యెంతయు వేసరిలక.

రాజాధిరాడ్భోగరంగంబు లందెప్డు
కస్తూరి జవ్వాదిగంధ మంటి
శ్రీమంతులగు వారిచెంత పన్నీరత్త
రుల నోలలాడి నిచ్చలు వెలింగి
అధమదరిద్రుల యంగంపు కంపుల
ముఱికిలోఁ బ్రేమాన మునిఁగి తేలి
సామాన్య జనముల సందిటి మూటవై
. యంగడి దుమ్ముల సంగతిగని

కడకుఁ బెంటపైఁ బడవేయ గడెగడెకును
గాలి విసరుల కెప్పుడు కదలు చుండి
చెదలుపురుగుల కన్నమై సదన మగుచు
పెంటపేలికా! పెంటపై వెలయు దిట్లు.

లోకసేవకై కడఁగిన నీకుఁ జూడఁ
జిక్కియుంపుట గుండెలు చిల్లులువడ
దుమ్ము గ్రమ్మిన కాయమ్ముతోడ నుంట
పెంటపేలికా! సేవకవృత్తి యిటులె.

వాన తడుప నగ్నియె కాల్ప వాయు వెగురఁ
జేయ నోర్చితి నీ తపస్సిద్ధి గంటి
కాలగతిని సేవాఫలాకాంక్ష మెయిని
పెంటపేలికా! నీదు నిస్పృహతఁ గంటి.

పనికిరాని వస్తువు లని పారవేయఁ
గసవుతోపాటు పెంటపైఁ గ్రాలి వాని
సేవఁజేయనో వానికి సేవ నేర్ప
నెంచితో పెంటపేలికా! యెంచి చూడ.

అన్నిరసముల ననుభవ మంది నీవు
ప్రేమరసము కన్నను వేఱు పెద్దగుణము
సేవకన్న నుత్తమకర్మ లేవనుచును
పల్కెదే పెంటపేలికా! వర్తనమున.

చాకిరేవున బండపైఁ జఱచుచుండ
సాగి చిక్కకొండగవుల చాలదవ్వు
నబ్బ! నా ప్రతిధ్వను లిడు నమ్మ ప్రకృతి
పెంటపేలికా! నీ యోర్పుప్రీతిఁ బొగడ.



# వితంతు బాలిక

మగఁడన నేమొ యత్తయును మామయు నెవ్వరొ నే నెవర్తెనో
మగబిడ యాఁడుబిడ్డ యను మాటల కర్థమదేమొ యిట్టి లీ
యగపడు లోకమెల్ల నెది యానొ యెఱుంగని కాలమందె యీ
యగతికురాలి పెండిలి మహామహు లందఱు కూడి చేసిరా?

మంగళసూత్రమో యురిమొ, మంత్రములో యవి తిట్టుకూఁతలో?
దొంగలొ బ్రాహ్మణోత్తములొ? దోయిళులన్దలఁబ్రాలొ మట్టియో?
యంగవిభూషయో తగులొ? యద్ది వివాహమొ తద్దినంబొ? యే
సంగతి నేనెఱుంగ నిటు చంపుదురేటికి ముండయంచు నన్.

వనితలు పండితుల్ లతలు ప్రాపుచు వీడిన జీవనమ్ముతో
మనుట యసంభవమ్మనుచు మాటలు మాత్రము జెప్పుచుందురా
కనుబుసి ముక్కుచీమిడియు గంపెఁడు చొల్లును గల్గియుండు పో
ఱిని నొక వృద్ధజంబుకప్రపేతకుఁ గట్టుటయా బలే బలే!

బట్టవిడిచివైచి బరిమేన తిరిగెడి, చంటిపోరి కేమి సకల శాస్త్ర
సారవేత్తలైన మీరలు పెండిలి, సేయుటేమి చాల సిగ్గు సిగ్గు.

పడుచా! యొందఱు నీకు బిడ్డలన సౌభాగ్యంబు మమ్మెన్నఁడో
విడిచెన్ భర్తనె చూడలేదనుచు మా వృత్తాంత మాద్యంతమున్
నుడువన్ బాపురె యెంతఘోరమను వార్తాటొక్కరై యుండు నీ
బడుగున్ భారతభూమి నొక్కరును మా బాధల్ నివారింపరే.

నీతోడివారు పెన్మిటితోడ హాయిగ
మన పుల్కుపుల్కునఁ గనఁగవలసె
నీ సఖులెల్ల పన్నీరత్తరులతోడి
గుమగుమ లాడఁగా గోల వలసె
నీ సాటివారు నానాసౌఖ్యములఁ దేలి
యాడ నీవొక పూఁట మాడవలసె
నీనేస్తురాండ్రు చిన్నికుమాండ్ర ముద్దాడఁ
గనుచు లోలోన పొక్కంగ వలసె

రేలు కన్నీరు కొలుకుల జాలు వార
పడెకఁ దడఁబడఁగా వలసె నా పాపమంచు
నా యుసురు దాకదా భారతీయులార!
యనుచు గొంతెత్తి కెవ్వున నార్చునపుడు
కడుపు చెఱువౌను కన్నీరు కాల్వలౌను.

ఎపుడు కంటికి మంటి కేకధారగ నేడ్చు
నేడ్పు మీ చెవులకే నెక్క లేదొ?
కూకటివేళ్ళకుఁ గూలనేసినయట్లు
పడియున్న మాదు రూపాలఁ గనరొ
ఎందఱో సాధ్వీలీ యిడుమలఁ బడలేక
బలిమి ప్రాణము వాయు వార్త వినరొ
ప్రాణాల విడుచు దుర్భర ఘోరతకు జాల
కితర జాతులఁ జేరుటే నెఱుఁగరొ

కొందఱో అంకుటాంధ్రయి కులములోనె
బయటఁబడకుండ చాటు గర్భముల నెన్నొ
కడకు దిగ్ద్రావిదొయో లేక కన్నబిడల
పిసికి పాతిపెట్టుటలేని వినఁబడవొకో?

ఒక మహామహుని లోకోత్తర తేజము
గర్భాన డాచి లోకము కిడుసతి
ఒక మహారసికు సంయోగసుధాంబుధి
నోలలాడించు రమాలలామ
ఒక మహాకష్టి బాహుశ్రమఁ దీర్చఁగ
సంశ్లేష మొసఁగు ప్రసన్నరూప
ఒక మహోధృష్టుని యుద్ధతి మానిపి
సాధువుఁజేసెడి సాధ్విమిన్న

నేఁడు నిర్బంధ వైధవ్య పీడవలన
గోడుగోడున మోమున కొంగిడుకొని
యేడ్చుచున్నది హా యని యెవరొ తనదు
వెతను దీర్తు రటంచు చదివె త్తితనము.

ఉభయకులమ్ముల నుద్ధరించెడు సాధ్వి
లుభయకులాల పే రుడుపవలసె
బిడ్డలఁగని పెంచి ప్రేమించు తల్లు లా
బిడల స్వహస్తాలఁ బిసుకవలసె
పరుల దాంపత్యసంపదకు మెచ్చు సుశీల
లా యాల్మగలఁ బాయఁదీయవలసె
యితరులఁ గన్నెత్తి యేని చూడని సతుల్
పరుని నిర్లజ్జతఁ దఱియవలసె
సకల సద్గుణ సంపదాస్థానమగుచు
నన్యులకు సతీత్వంపుపాఠాళి నొసఁగు
భారతసతీజన మ్మతి బాల్యకాల
పరిణయాలచే నింత చేడ్పాటునొందె.

తుంగచువ్వాల వలె పొంగి పోయెడి వయ
స్ఫూర్తినిఁగని వలపోయువారు
పసుపు కుంకుమముల బరిణెలఁజూచుక
గ్రుడ్లనీర్ గుడ్లలోఁ గుక్కువారు
ప్రణయమందిరముల పట్టుపాన్పులఁగని
వలవల కన్నీరు వడపువారు
అద్దాల తమ వగు ముద్దురూపులఁగని
యేల కాల్పఁగనె యం చేడ్చువారు
ఊరు నడవిగఁ దలఁచుచు నులుకువారు
అడవి నూరుగాఁ దలఁచుచు వెడలువారు
బ్రదుకు చావుగాఁ దలఁచుచు బ్రతుకువారు
చావు బ్రదుకుగా నెంచుచు చచ్చువారు.

అతిచిన్నయీాటనె యంపి కూర్చున్నది
యవలక్షణపు పోటి యనెడివారు
మిత్తియై మగనిని మ్రింగి పెట్టినది యీా
చమురుకాళ్ళది యని చాటువారు

ఏమంచు నింట కాలిడెనో యీ వేడుపు
గొట్టు పెద్దమ్మని తిట్టువారు
ఈ దుర్దశపు మారియే రాక యున్నచో
నింక కొన్నాళ్లు జీవించు నేమొ
దీని యేడ్పు ముందరపడె దీనికేల
చావురాదయ్యొ నను చతిసాహసమున
మోముఁ బట్టుకొనియె తిట్టి పోయువారు
అడ్డమైన వా రీశ్వరా! హా యిఁగెట్లు?

మొదలె యలిపిరిప్రాణము భిమరమట్లు
పైనఁబడిన దుఃఖమ్ము నెప్పగిది నోర్చు
కనులు వాచెను కడుపు చెక్కలయిపోయె
గొంతు శుష్కించె నెలుగు బొంగురువడియెను
మోము నెత్తురుముద్దయై పొంగె పైకి
ఏడ్పుమాన్పెడివారు నీ కెవరె? బిడ్డ.

అప్పటి నీదుదుఃఖమున కంతమె లేదు జగత్తునంత నీ
నిప్పులఁబోలు వేడి కనునీటి కణమ్ములఁ గాల్చివైచినన్
దప్పగలాదె? నీహృదయదాహము నీహృదయంబెఱుంగు నీ
మొప్పెతనంపు పూరుషులు ముంచిరిపో నిను దుఃఖవారిధిన్.



# కలను గన్పడునట్టి నాకన్నతల్లి

[ఈ శీర్షిక మారెండవయన్న లక్ష్మణాచార్యులు వ్రాసిరి. మాయమ స్వర్గస్థురాలైనపుడు వీరు సమీపమున లేకుండిరి. పిదప వచ్చి ఆమె యెముకలను గోదావరిలో వేయుటకు వెడలుచుండగా రాత్రి నిదురలో కలలో గన్పడిన తల్లినిగూర్చి చెప్పిరి.]

ప్రతిదినము రేయి రెప్పలు బడినయంత
పసపుఁ బూసికొనియు ముద్దుపట్టుచీరఁ
గట్టుకొని కుంకుమ నుదుటఁ బెట్టుకొనియు
కనుల నగుమోము సొమ్మయి గ్రాలుచుండ
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

పవలు చిత్తాన రేయి స్వప్నాన మమ్ము
చచ్చియును విడగాలేని జాలిగుండె
గల్గు నీ యాత్మశాంతికై కడలఁ దిరిగి
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

కన్నకడుపుపై ప్రేమ మీ కరణినుండు
నంచు పాశమ్ము సెప్పెదె యమ్మరో నిను
చరమదశఁ గాంచలేని వంచకు క్షమించి
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

విద్వదగ్రగణ్యుఁడు పతి వెలయుచుండ
సంస్కృతిని సంతతికి శుభసంస్కారణము
లన్ని దీర్చి పరమపద మ్మంది గూడ
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

తనయులందఱు కవులు విద్వాంసు లనియు
భర్త శాస్త్రి యనియు పొంగిపడుచు నుండి
దివిని విద్వత్కుటుంబకీర్తి వెలిబఱుప
ముందు జని మమ్ము సద్గతి నొందఁజేయ
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

నీ పతివ్రతాధర్మంబు నిర్వహించి
కాలమంతయు పతిసేవఁ గడపి దివిని
తగిన యేర్పాట్లు మముఁజేయఁ దలఁచినట్లు
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

లక్ష్మణుఁడు వచ్చెననిన విలక్షణ మగు
దయయొలుక కన్నువిప్పు సీతమ్మ పగిది
అమ్మకష్టాన కనువిప్పి యటిటు గంటె
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

మనసు జెదరిన తండ్రి నేమరుట తగవె
గతియెలేని సంతతి విడగా దగునొకొ
యని వగవ మాతవై హిత మభిలషింతె
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

తిట్టినను మాకు నీ తిట్లు దీవనలయి
నీ యమాయిక ప్రేమపునియతిఁ దెలుప
నీ గభీరాశయార్థమ్ము నిర్ణయింప
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

చరమవిధియగు దహనసంస్కార మేను
జేయమిని నధమర్ణత సిద్ధమేని
చితిని నిను గాల్ప నాయెద చెక్కలగును
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.

అంతిమస్థితి దర్శన మందలేని
దుర్భగుని దుర్దశ నెటుల ద్రోయుదునని
విడువలేని పేర్మిని బయ ల్వెట్టఁ దలఁచి
కలను గన్పడునట్టి నా కన్నతల్లి.



# మఱపురాని నాతండ్రి ని న్మఱతు నెట్లు?

బ్రదికితివి యెనుబదియేండ్లు పండుబండి
నిలిపితివి కీర్తి విద్యల నిపుణతఁగని
బ్రదికి బక్కయ్యశాస్త్రి పురాణము విన
వలయు చచ్చి స్వర్గమ్ము నే బడయవలయు
న నెడి లోకోక్తిఁ బుట్టించితయ్య! జగతి
మఱపురాని నాతండ్రి నిన్మఱతు నెట్లు?

పండుబారిన యామేను బ్రహ్మ విద్య
మఱియు జ్యోతిష్కలయు నెట మరగిపోయె
మమ్ముగన్నమ్మ నెన్మిది మాసములును
విడువలేక ముక్తినిఁ గన వెడలినావా
మఱపురాని నాతండ్రి! నిన్మఱచు టెట్లు?



